

శాస్త్ర గురుబోధలను, మఱి స్వానుభవము
కలిమి, నెద్దాని నరుఁ డెఱుఁగఁడగ నమ్ము
నదియె శ్రేష్ఠంబుఁ, బరమమౌనదియు, యదె జ
.గంబునన్ వాని కవలంబ నంబు సాయి !

ఓమ్.

శ్రీ సాయీ సద్గురవేనమః.

# శ్రీ సాయీ మననము

(మూడు సర్గములు)

Acc. No: 15986

N35 / ROP



రచయిత :

బాపట్ల హనుమంతరావు,

శ్రీ సాయీ కుటీరము,

చిన్నగంజాము.

# ప్రశంస



'పూజా స్తవంబు' లమృతపు
భోజనములు, సాయిభక్త పురుషార్థ శ్రీ
భాజనములు, దైవత నీ
రాజనములు, సాధుభావ రస వీజనముల్.

* * *

జననం బభ్యుదయంబులకు,
ఖననము సద్భక్తి భూమి గర్భ మణులకున్,
హనన మఘములకు, 'సాయీ
మననం' బౌషధము జనన మరణంబులకున్.

చీరాల
21-8-58

బందా ఆదినారాయణ.

# పోషకులు

| | | రూ. |
|---|---|---|
| 1. | శ్రీ పాతిల విశ్వనాథశర్మగారు, S. ఇల్లిందలపర్రు (ప. గో. జిల్లా) | 116 |
| 2. | శ్రీ రామాయణము లోవరాజుగారు, అధ్యక్షులు శ్రీ సాయీ సమాజము, తుని | 20 |
| 3. | శ్రీ రావుల దేవేంద్రనాథము పంతులుగారు పేరాల, (బాపట్ల తా॥) | 20 |
| 4. | శ్రీ నోరి వెంకటేశ్వర్లుగారు I. L. T. D. Co. Ltd. చీరాల | 20 |
| 5. | శ్రీ మామిడి వెంకటరమణగారు Cloth Merchant, తుని | 10 |
| 6. | శ్రీ K. మాధవరావు నాయుడుగారు, సీతాఫల్ మండి సికిందరాబాద్ | 10 |
| 7. | శ్రీ R. శ్రీనివాసరావుగారు, Asst. Surgeon జగ్గయ్యపేట | 10 |
| 8. | శ్రీ అద్దంకి వెంకటకృష్ణయ్యపంతులుగారు Land-Lord ఒంగోలు | 10 |
| 9. | శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావు పంతులుగారు వేటపాలెం, (బాపట్ల తాలూకా) | 10 |
| 10, | M. K. V. శర్మగారు, సబ్ రిజిస్ట్రార్ పాలమనేరు, (చిత్తూరు జిల్లా) | 10 |
| 11, | M. రత్నేశ్వరరావుగారు, ఓవర్ సీరు పాలమనేరు, (చిత్తూరు జిల్లా) | 10 |
| 12 | శ్రీ రావినూతల సత్యనారాయణగారు, S. E. I. డిస్పెన్సరి, గుంటూరు | 10 |
| 13 | శ్రీమతి కమలా వేంకటరత్నంగారు శ్రీ సాయీ మందిర ప్రతిష్ఠాపకురాలు, కాకినాడ | 10 |

| | | రూ |
|---|---|---|
| 14 | శ్రీ K. V. చలపతిరావుగారు, అరండల్ పేట గుంటూరు | 10 |
| 15 | శ్రీ కర్రి పెద మునిరెడ్డిగారు S. ఇల్లిందలపర్రు ప. గో. జిల్లా | 10 |
| 16. | శ్రీ కర్రి నాగిరెడ్డిగారు (Post Master) S. ఇల్లిందలపర్రు ప. గో. జిల్లా) | 10 |
| 17. | శ్రీ సత్తి వెంకటరెడ్డిగారు S/o సాహేబురెడ్డిగారు S. ఇల్లిందలపర్రు (ప. గో. జిల్లా) | 10 |
| 18. | శ్రీ మల్లిడి సత్తిరెడ్డిగారు, S. ఇల్లిందలపర్రు. ప. గో.జిల్లా) | 10 |
| 19. | శ్రీ కర్రి నాగిరెడ్డిగారు S/o వెంకన్నగారు. డిటో' | 10 |
| 20. | శ్రీ ద్వారంపూడి వెంకటరెడ్డిగారు, వెలగలేరు, డిటో | 10 |
| 21. | శ్రీ R. S. సోమయాజులుగారు I. L. T. D. Co. Ltd., చీరాల | 10 |
| 22 | శ్రీ వేదుల రామమూర్తిగారు, నరసింగరావుపేట, అనకాపల్లి. | 10 |
| 23. | శ్రీ R. S. సోమయాజిగారు Building Inspector అమలాపురం | 10 |
| 24. | శ్రీ G. విశ్వనాధం చెట్టిగారు Registrar, Co-operative Societies. Hydarabad. | 10 |
| 25 | శ్రీ దేవత సుబ్బారావుగారు Assistant District Judge. శ్రీకాకుళం. | 10 |
| 26. | శ్రీ P. C. రంగారావు పంతులుగారు Dt. National Savings organiser. కర్నూలు | 10 |
| 27. | శ్రీ గుంటూరు సత్యనారాయణగారు I. L. T. D. Co. Ltd., పరుచూరు, | 10 |
| 28. | శ్రీ గంగరాజు మార్కండేయ శర్మగారు I. L. T. D. Co. Ltd., కొమ్మూరు | 10 |
| 29. | శ్రీ రాజయోగి. దేవత రంగనాధరావుగారు శివానందాశ్రమ స్థాపకులు, తుని. | 10 |

30, శ్రీ R. అనందరావు పాత్రోగారు Secretary, Co-op. Urban Bank పర్లాకిమిడి రూ 10

31. శ్రీ అప్పారి అర్జునరావుగారు. వేగివారిపాలెం, తూ.గో.జిల్లా. 10

32. శ్రీ Y. A. చలపతిరావుగారు, పోలింఘర్, చిత్తూరుజిల్లా. 10

33. శ్రీ P. V. సుబ్బారావుగారు Spl. Revenue Inspector, చీరాల. 10

34. శ్రీ P. సుందరరామ శాస్త్రిగారు I. L. T. D. Co. Ltd., చీరాల. 10

35. శ్రీ రావెల వేంకటసీతారామారావుగారు(కరణంగారు) రావెల 10

36. శ్రీ L. శోభన రామసింగ్ గారు Sub Post-master మోపిదేవి (కృ. జిల్లా) 10

37. శ్రీ లక్కిరెడ్డి చిన పాపిరెడ్డిగారు పంచాయతీబోర్డు ప్రెసిడెంటు-వల్లభాపురము (తెనాలి తా.) 10

38. శ్రీ లక్కిరెడ్డి లక్ష్మిరెడ్డిగారు Land-Lord వల్లభాపురము తెనాలి తాలూకా. 10

39. శ్రీ లక్కిరెడ్డి సుబ్బారెడ్డిగారు S/O స్వామిరెడ్డిగారు Land Lord వల్లభాపురము, తెనాలి తాలూకా. 10

40 శ్రీ రావినూతల శ్రీరాములుగారు Head-master B. H. School వల్లభాపురము తెనాలి తాలూకా. 10

41. శ్రీ వ్యాసం వీరాంజనేయులురావుగారు జగన్నాయకపురము కాకినాడ. 10

42. శ్రీ S. V K. రాజశేఖరరావుగారు పోస్టల్ సూపరింటెండెంట్ ఆఫీసు, చిలకలపూడి. 10

43. శ్రీదామరాజు వేంకటేశ్వరరావుపంతులుగారు D. S. P. (Retired) శ్రీసాయీమందిర ప్రతిష్ఠాపకులు గుంటూరు 10

44. శ్రీ ప్రభల తిలక్ గారు National Tobocco Co., గుంటూరు. 10

45. శ్రీ మన్నె వెంకటనారాయణ చౌదరిగారు Land Lord కొడమంచిలి (కృష్ణా జిల్లా) 10

46. శ్రీ నాగభైరవ వెంకటరత్నంగారు (శ్రీ సాయిబాబా మందిరము తరఫున) వేంట్రప్రగడ (కృష్ణాజిల్లా) 10

47. శ్రీ చిత్తుకుల వీరరాఘవయ్యగారు (Retired teacher Municipal high school) చీరాల. 10

48 శ్రీ V. శేషగిరిరావుగారు Teacher Manager చీరాల 10

49. శ్రీ A. నాగభూషణంగారు Progress asst. B. D. O's office మద్దిపాడు. 10

50 శ్రీ రాళ్ళబండి సత్యనారాయణగారు Head master B. H. School వెనమలూరు (కృష్ణజిల్లా) 10

51 శ్రీ వల్లభనేని సూర్యనారాయణగారు మంజులూరు ,, 10

52 శ్రీ రావినూతల అంజయ్యగారు S/O కామయ్యగారు రావినూతల (ఒంగోలు తాలూకా) 10

53 శ్రీ M. S. మూర్తిగారు (Income tax Officer) నాగపూరు 10

54 శ్రీ ఆకుల రంగారావుగారు I.L.T.D. Co. Ltd., చీరాల 10

55 శ్రీ V. వెంకటేశ్వరరావుగారు Plat-form contractor చినగంజాము 10

56 శ్రీ వానపాముల సత్యనారాయణగారు Drawing master. B. H. School మోపిదేవి 10

57 శ్రీ రావి రంగయ్యగారు (Land Lord & Mill Owner) మోపిదేవి 10

58 శ్రీ D. వెంకటేశ్వరరావుగారు Prop: శ్రీ వెంకటరమణ కేఫ్ బ్రాడీపేట, గుంటూరు. 10

59 శ్రీ K. V. శాస్త్రిగారు I. L. T. D. Co. Ltd., చీరాల 10

60 శ్రీ గాలి వెంకటసుబ్బారావుగారు డిటో డిటో 10

61 శ్రీ వెలగపూడి సుబ్బారావుగారు ఆత్మకూరు (via మంగళగిరి) (భక్తుల తరఫున) 10

— : కృతిభర్త :—

# శ్రీకృష్ణరామ దత్తశివ మారుతీస్వరూప సాయీప్రభువు



ఇచటనేనుండ నీకు భయమేల? నిన్ను నీబిడ్డల నాపై, నేను నిర్వహింతు;
నన్నుగను- వేయికన్నుల నిన్ను గందు; శ్రితుని నిన్నెప్పుడే నుపేక్షింతునేమి?

ఓమ్

శ్రీ సాయీ సద్గురవే నమః.

# ప్రార్థన.

సాకారుండవో, లేక, ని
రాకారుఁడవో, మఱేమి యగుదువో యెఱుఁగన్
నాకగునె ? శిక్షితుఁడ, జడుఁడను,
సాకవె ! నీ కరుణఁ బఱపి సాయీనాథా !

సందేహము లడఁపవె ! నీ
యందున నేకాంతభక్తి నందింపవె ! ని
న్నొందేమఱ నీకవె ! యఘ
సందోహముఁ బాపఁగదవె ! సాయీనాథా !

చేయఁదగని పనులు చేసితి నెన్నియో
చేయఁదగిన వానిఁ జేయనైతిఁ,
గృపణుఁడైన నాకు నిఁక వేఱు గతిలేదు
కరుణఁ బఱపి ప్రోవఁ గదవె ! సాయి !

---

శ్రీ

# ఆశీస్సు

శ్రీ సాయీభక్తులకు ఈ పుస్తకము మిక్కిలి యుపయోగకరము. శ్రీ సాయీబాబా యీ రచయితను ఎల్లవిధముల అనుగ్రహించునుగాత !

స్వామి కేశవయ్యా జీ.

శ్రీ సాయీనిలయము
షెన్వాయినగర్
మద్రాసు 30
11-8-'58

# విషయసూచిక

## ప్రథమ సర్గము



## ద్వితీయ సర్గము

## తృతీయ సర్గము

ఓమ్

శ్రీ వేంకటేశాయ నమః

శ్రీ సాయీనాథాయ నమః

# విజ్ఞప్తి

భక్తజనులారా !

దైవానుగ్రహమునను, సాధుభక్త జనానుగ్రహమునను "శ్రీ సాయీ మననము" అను కృతిని ఆంధ్రలోకమునకు సమర్పించు భాగ్యము నేటికిఁ గలిగినది. శ్రీ సాయీబాబా రూపమున నవతరించిన యాపరంధాముఁ డెవరెవరిచే నేమేమి చేయించఁ దలఁచెనో వానినిఁ బూర్తిఁగావించును. ప్రతిజీవియు నేదోక పనికొఱకే యీ ప్రపంచ నాటకరంగమున పాత్రధారియై ప్రవేశించును. ఆపాత్ర కార్యము ముగిసినతోడనే రంగస్థలమునుండి నిష్క్రమించును. మంచి చెడులుగ, ఉచ్చ నీచములుగ, నాయా పాత్రలకార్యములు-పాత్రలు గోచరించినను, సకలమును విధి విధానము ననుసరించియే జరుగును. అందఱు రాజులు, మంత్రులుగ, నందఱు భటులుగ నుండిన నాటకము సాగునా? రాజునకు గౌరవము ప్రకటన మంత్రులు భటులుండిననే కలుగును. కుజనులున్నప్పుడే సుజనుల ఆధిక్యత ప్రకటమగును. రావణుఁడే లేకుండిన శ్రీరాముని, దుర్యోధనుఁడే లేకుండిన

ధర్మరాజును గూర్చి మనమింతగా చెప్పుకొనముగదా ?
చీకటియే లేనియెడల సూర్యచంద్రాదులకిట్టి పూజ్యతయే కలు
గదు జగన్నాటక సూత్రధారుఁడగు శ్రీనారాయణుఁడు
తన విశ్వలీలలఁ బ్రదర్శించుటకు వివిధ గుణాదికములు గల
పాత్రలఁ బ్రవేశపెట్టి వారివలనఁ బ్రదర్శింపఁ దలఁచిన పను
లను జేయించి, నిష్క్రమింపఁ జేయును. కావున ప్రపంచ
మొక పఠనీయ గ్రంథము. దానిని పఠించి ప్రతిజీవియు
చెడుమార్గమును విడచి సాధుమార్గము ననుసరించి జన్మ
సాఫల్యము వడయఁ బ్రయత్నింపఁదగును.

ఈ విశ్వనాటకరంగమున నేను నొకపాత్రను. విద్యార్థి
దశయందు పెద్ద చదువులు చదువకున్నను, సంస్కృ
తాంధ్రాంగ్ల భాషలయందుఁ బిదప హిందీ భాషయందుఁ
గొంత కృషి సలిపియుంటిని. ఉపాధ్యాయవృత్తిలో జీవనము
ప్రారంభించితిని. అందలి సంపాదన సంసార పోషణకుఁ
జాలదని వ్యాపారమున విత్తమార్జింప వలయునని సంకల్పించి
యొకప్రక్కన ఉపాధ్యాయవృత్తి మఱియొకట వ్యాపారము
నడుపఁజూచితిని. చివరకు వ్యాపారము వ్యవహారముగ పరిణ
మించి అభియోగములు, కష్టములు, ప్రాప్తించెను. అధిక
విత్తము గడింపకపోగా, ఉన్నకొద్ది భూవసతియు నాశనమై
తుదకు జీవితముపై విరక్తి గలిగి మరణంబే శ్రేయమనిపించు
గతి గలిగినది. అట్టిసమయమున-తారణ సంవత్సర పుష్య
శుద్ధ ౧౨ లు (27-12-44 5-00, A. M.) మంగళవారము

తెల్లవారుజామున 5 గంటలకు బంగారుచాయ గలిగి ఆజాను బాహుఁడు తెల్లనికుప్పి, తలకు గుడ్డ, గడ్డముగల ఒకమహానుభావుఁడు స్వప్నమునఁ దోఁచెను. ఎన్ని యొడిదొడుకులు గలిగినను బాల్యమునుండి మంచిబాలురతోడి చెలిమివలన దైవభక్తి యేకొంచమో యొకప్రకారన నాదిగియుండుటచే కలలో నెవరేని పెద్దలు గోచరించిన సాఁగిలఁబడి మ్రొక్కు నలవాటు కలిగియుంటిని. ఆకారణమున నెదుటఁ దోఁచిన యా మహానీయునకు సాష్టాంగ నమస్కృతులు గావించి దోసిలొగ్గి నిలచియుంటిని. అవ్యక్తి చేతిసన్నచే నన్ను "రారా! ఇటురమ్మని"— అని దగ్గఱకుఁజేరి, "నీవు ఏమేమి వ్రాసితివిరా?"— అని ప్రశ్నించెను.

1 శ్రీమద్భగవద్గీతామృతము. (భగవద్గీతలు - ప్రతి శ్లోక తెనుఁగు పద్యము)

2 ప్రబోధ సుధాకరము. (శ్రీ శంకర భగవత్పాద రచిత ప్రకరణ గ్రంథమునకు ప్రతిశ్లోక తెనుఁగు పద్యము)

3 ప్రేమామృతము. (నారద భక్తి సూత్రములు. టీక తెనుఁగుపద్యము-వివరణ గీతమాలిక.) (అముద్రితము)

మొదలగు గ్రంథములు రచించితినని మనవి చేసితిని. అంతట నామహాత్ముఁడు "సరే! వానినట్లుండనిమ్ము -ఇఁకనీవు వీనిని-వీనిని రచింపుము"-అని పలికెను. "చిత్తము - అలాగే రచింతును" - అని నేను సమ్మతిఁ దెలిపితిని. ఆ మహాపురుషుఁడు

నన్ను కరమున స్పృశించి ఆశీర్వదించి అదృశ్యుఁడయ్యెను. కనులు తెఱచితిని. తెల్లవాఱెను.

కాలకృత్యములఁదీర్చికొని, "యీస్వప్న మేమియో?" అని యాలోచించుకొనుచుంటిని. కలఁగని గంటయైన కాలేదు. చీరాలనుండి నా చిన్ననాటి మిత్రుడును, నా యీ జీవితమున ఆధ్యాత్మిక మార్గోపదేశియగు (శ్రీ) బందా ఆదినారాయణగారు (అప్పటిలో నేనున్న బాపట్లకు) నాదగ్గఱకువచ్చి అఖిల భారత (శ్రీ) సాయీ సంఘాధ్యక్షుఁడు- పూజ్య(శ్రీ). బి. వి. నరసింహస్వామిగారు చీరాలకు విజయంచేసి '(శ్రీ) సాయీబాబా'ను గూర్చి ఉపన్యాసము లిచ్చుచున్నారు. నీవేమియో వ్రాయువలయునట - (శ్రీ) కామరాజు గడ్డ నరసింహారావుగారు (Sanitary Inspector-now retired) నిన్ను వెంటఁగొనిరమ్మని రైలుచార్జిగూడ ఇచ్చి పంపినారు" అనిచెప్పి నన్ను వెంటఁగొనిపోయి యారాత్రి (శ్రీ) నరసింహస్వామిగారి దర్శనము చేయించిరి. సాఁగిలఁబడి మ్రొక్కిన నన్ను వారాశీర్వదించి (శ్రీ) సాయీబాబానుగూర్చిన కృతులు (శ్రీ) సాయీమతనము మొదలగునవి తెనుఁగున రచింపవలసినదిగ ఆనతిచ్చిరి. వారప్పటికి ప్రచురించిన కృతుల నాకు ప్రసాదించిరి.

అంతవరకు" కలలోఁదోచిన వ్యక్తి యెవరో?" యని తలంచితిని. (శ్రీ) సాయిబాబాను గూర్చి వినియెఱుఁగని నేను మఱునాఁటమున జరిగిన యీపై సంఘటనము గమనించి, (శ్రీ)

సాయీశప్రభువు అనుగ్రహము నేటికి నాపైఁ గలిగినదిగదా!
అని, మనమున నుప్పొంగి బాబాకు ధన్యవాదములర్పించితిని.
ఆదినమే (శ్రీ)కృష్ణ రామ శివ మారుతీస్వరూప (శ్రీ) సాయీ
నాథుని పటము సంపాదించితిని. పతితుఁడనై బ్రతుకుపై
నసూయ గలిగిన నాపై (శ్రీ) సాయీశప్రభువున కనుగ్ర
హము కలిగి, తన యాస్థానమున నొక కవి (కింకరు) గా
నియమించుకొని, వ్యసనాతపమున శోషిల్లిన నాజీవనలతిక
కమృత పరిషేచనము చేసి సముద్ధరించిన బాబాకు వేనతు
లర్పించితిని. '(శ్రీ) సాయికరుణ'-యను కృతియందుఁ బలికిన
వాని నిందుఁ జేర్కొనుచున్నాఁడను.

## స్వప్న వృత్తాంతము

* * * * *

"చనియె నలుఁబది రెండు వర్షములు పీని,
కంత దనుక నెయ్యెడ నుంటి వయ్యా! నీవు?
అప్పటికి నీకు జ్ఞాపకం బైతి నేమి?
ద్వారకా మాయి సాయిబాబా! మహాత్మ!

ఏను నినుఁ జేరుటనిన నాకేమి యెఱుక
మోహ వారాశి యందున మునుఁగుకతన!
నీదు బిడ్డల సాకఁగ నీక చెల్లు;
సత్యమిది; ద్వారకా మాయి సాయిదేవ!

సమసె బంధు మిత్ర జాయా సుతక్షేత్ర
వివిధ భోగ గర్వ విస్మృతంబు;
శేషమొందె సాయి! "శిరిడి సంస్థాన
కవి"నటంచు నెగడు గర్వమొకటి.

గురు జనుల సేవచే నేర్చికొన్న చదువు
లేశమైన నీ వానిలో లేదు-లేదు;
వీని యందేమి కాంచి యాస్థాన కవిఁగ
సలిపి కొంటివో యెఱుఁగ- శ్రీసాయిదేవ!

నీకృతులు వల్కుతటి నాదు వాకు నందు
నిలిచి నీవు పల్కించిన పలుకుఁబలుకు
వాఁడ;- నిందు నాఘనత యేజాడలేదు;
సైపు దాసఁగులు పోసఁగిన సాయినాథ!"

( శ్రీ సాయి కరుణ )

ఎందుకుఁగో అగాని నాపై శ్రీసాయీ ప్రభువున కను గ్రహము గలిగినదనుట - అది నాపురాకృత సుకృత లేశ మేమోకాని. యీ జన్మలో నాకావించిన మంచిపని లవమేని యులేదని మనవి చేయుచున్నాఁడను.

"అయ ముత్త మోఽయ మధమో
జాత్యా రూపేణ సంపదా వయసా
శ్లాఘ్యోఽశ్లాఘ్యో వేత్థం
నవేత్తి భగవా ననుగ్రహావసరే."

" జాతి రూప వయో భాగ్య సంచయమున
నీతఁ డుత్తముఁ డధముఁ డౌనీతఁ, డితఁడు
శ్లాఘనీయుండు నీతఁ డశ్లాఘ్యుఁ డనుచు
నెంచఁబోఁడు కృష్ణుఁ డనుగ్రహించు వేళ."

( ప్రబోధసుధాకరము (౧౮) అనుగ్రహ ప్రకరణము. )

దైవ మనుగ్రహింపఁ దలఁచు నేని ఉత్తమాధమ చర్చలు జాతి విద్యా రూప సంప దాదుల తారతమ్య వివేచనలతోఁ బనిలేదు. పూర్వజన్మ సమార్జిత సుకృత లేశమున్నఁజాలును. ఈవిషయమునే తలంచుచు 'శ్రీసాయి స్మరణ' యందిట్లు పలికితిని:-

"తొలి జన్మంబున శ్రీశిరిడియందు ద్విజ జంతు స్థాణు పృథ్వీజగుల్మల తానేకములందొకండ నయి ప్రేమన్ నీవా నీభక్తులో మెలఁగన్ దత్పద రేణు సంగతిని నీ మేనొందితిన్ నీపదంబుల ప్రాపొందఁగ నోమునోచితిని; బాబూ! సాయినాథప్రభూ!

* * * * * * *

తొలి జన్మంబున నీయనుగ్రహ మదేదో రీతి నార్జింపనేగలదే నీపద కంజ భక్తిఁ గను భాగ్యంబీ భవంబందు? ముఁగల, నన్నేరఁగఁ దీసి ప్రోచుదువె? నీకబ్బాలు పల్కింతువే? నిలుఁవం బెట్టుదె యింతకాలమును తండ్రీ! సాయినాథప్రభూ!"

( శ్రీ సాయిబాబా పూజాస్తవములు - శ్రీసాయిస్మరణ )

బాబా యీ నన్ను గ్రహించిన విషయము సోదర
భక్తులకుఁ దెలుపుకొనుటకింతదనుక వ్రాసినాఁడను. ఆదినము
మొదలు వేయి కనుల పరిరక్షించుచున్నాఁడు - రక్షింపఁ
గలఁడు. శ్రీ సాయి ప్రభువు తన్నాశ్రయించిన చీమ నేని
మనిచి సద్గతి నొసంగఁ గలఁడు. ఇది త్రికాలసత్యము అని
మనవి చేయుచున్నాఁడను.

## శ్రీ సాయి ప్రభువు :-

శ్రీసాయి బాబాను గూర్చి యొకటి రెండు విషయ
ములు దెలుపుదును. "శ్రీసాయీనాథుడు అవతార పురు
షుఁడా ? అయిన-ఆయన సాధించినది యేమి ?" - అని కొంద
ఱకు సందియము కలుగవచ్చును. నా మిత్రులలో కొందఱు
" సాయి బాబా కూడా దేవుఁడేనా ? ఉన్న దేవుళ్లు చాల
కనా ?" - అని నన్ను ప్రశ్నించిన వారును కలరు. ఈవిష
యమును గూర్చి —"సాయి సుధ"— (All India Sai
Samaj. Mylapore-Madras) 1958 జనవరి, ఫిబ్రవరి,
మార్చి - నెలల పత్రికలందు వ్యాసముల వ్రాసియుంటిని.
బాబా అనుగ్రహించిన ప్రత్యేకముగ ప్రచురించి సోదర
భక్తుల కందింపఁగలను. అవకాశము లేని కారణమున నొకటి
రెండు విషయములు మాత్రము తెలుపువాఁడను.

శ్రీరామ- శ్రీకృష్ణా ద్యవతారములను గూర్చియు
నిట్టి కుతర్కములు కావించిన వారును లేక పోలేదు. మహాస్వ

ద్వవ తారములు దత్తాత్రేయా ద్వవ తారములు నేను
పరిశీలించిన ఒక యవతారములోని కృత్యులు మరియొక యవ
తారమున లేవు. వేని కవి ప్రత్యేకములు. విశిష్టములు. అవ
తార క్రమము ననుసరించి పరిక్షించిన దుష్టులను వధించుట
కంటె దుష్ట హృదయ పరివర్తనముఁగూర్చి, శిష్టులకు [illegible]
రించిన విషయము లెన్నేనియు గలవు. భగవంతుఁ డవతరిం
చుటకు శంఖ చక్రాద్యాయుధములు – కిరీట కౌస్తుభాది వన
మాలాదులు ధరింప నవసరము లేదనియు, సాధారణ వ్యక్తిగ
ఒక పేద "ఫకీరు"గఁగూడ అవతరింప వచ్చునని సూచించు
టకే ఆపరాత్పరుఁడు– శ్రీసాయి బాబాగా అవతరించినాఁడు.
"విశ్వమానవ ప్రేమ- సర్వభూతదయాళుత్వము" జనసమాజ
మునందుఁ బాదుకొలిపి, మానవ సంఘమును, ముఖ్యముగా
భారతీయులను చక్క దిద్దుటయే శ్రీ సాయి నాథావతార
విశిష్టత. బాబా బోధించిన విషయములలో 'మతము'-
అనునది మానవ కల్పితము. 'దైవము కలఁడు' అని చెప్పు
నది యే మతమైనను సాధుసమ్మతమే. సర్వ మత సమానత
మత స్థాప నార్థమై శ్రీ భగవానుఁడు శ్రీ సాయిబాబా
అవతరించినాఁడు. ఏ పేరు పెట్టి పిలిచినను అవి యన్నియు
దైవమునకు చెందు చున్నవని బాబా ఎల్లరకు ప్రకటించి
నాఁడు. ప్రదర్శించినాఁడు. మన భారత దేశమున అన్యోన్య
మత కలహములతో సదమ దమగు హిందూ మహమ్మదీయు
లకు సఖ్యతఁగూర్చి 'కబీరు'గా నవతరించిన ఆభగవానుఁడే
శ్రీ సాయిబాబాగా అవతరించి, తన యవతార విశిష్టతను

ప్రకటించినాఁడు-ప్రకటించు చున్నాఁడు-ప్రకటించఁగలఁడు. దైవమే ప్రేమ- ప్రేమయే దైవము- అను సత్య సిద్ధాంతము నెల్లర కెఱుక పఱచినాఁడు.

## శ్రీ సాయి మ న న ము :-

'మన - జ్ఞానే- ' యను వ్యుత్పత్తి ననుసరించి మననము = చింతనము- అను అర్థము బోధపడు చున్నది. జ్ఞాన స్వరూపమై ప్రాప్యమగు వస్తువును గూర్చిన చింతనము- మననము. 'సాయి'- 'సాఈ ' - అను పదమునకు సాయీ నామ నిర్వచనము ప్రథను సర్గమున రెండవ పద్యమునఁ దెలిపి యుంటిని.

సంస్కృత భాషయందు 'స్వామి ' అను శబ్దమునకు హిందీ వికృతి 'సాఈ ' అని నిఘంటువు లందు దెలుపఁ బడినది. దీని ననుసరించియె గోస్వామి - గోసాఈ- గోసాయీ- అను పదములు నిష్పన్నము లైనవి. భగవంతుఁడు జగత్ప్రభువు- జగన్నాథుఁడు కావున -'స్వామి - సాయీ - ' అగు చున్నాఁడు. 'బాబా ' అనిన- 'పిత ' అని అర్థము. భగవానుఁడు జగత్పిత. బాబా - శబ్దమున మాధుర్య ప్రేమ లుట్టి పడుచుండును. జగన్నాథుఁడు - జగత్పిత యగు ఏవ్యక్తి కలఁడో ఆ వ్యక్తి 'సాయీబాబా .' అగుచున్నాఁడు. ప్రపంచమున సాధువులు- గోసాయీలు. ( గోస్వాములు ) వేనకు వేలుండినను. 'సాయీబాబా ' అనే అభిధానము 'శిర్డి ' యందవతరించిన ఆ సచ్చిదానందాత్మక తత్త్వమునకే

అన్వర్థాభిధానమైనది. పూర్వభవమున (కాశీ) రామానంద యోగియై, శ్రీ వేంకటేశావతారమను ప్రసిద్ధి గాంచిన శ్రీ గోపాలరావుదేశముఖ్- (సేలునందు- శ్రీ వేంకుశ) సద్గురు కృపా కటాక్ష వీక్షణమున వర్థిల్లి సంపూర్ణ సిద్ధులు అధికారము వడసి అధికార పురుషుఁడై సకల జీవుల సముద్ధరించుటకు శిర్డియందు వెలసినవాఁడు శ్రీసాయీబాబా.

"నామ చింతామణియ సాయి నామమొందు
నముల చైతన్య రస విగ్రహంబు సాయి;
పూర్ణముక్తుఁడు శుద్ధుఁడై పొలుచు శ్రితుఁడు
నామ నామినులకు భేద మేమి లేమి"

(శ్రీ సాయి మననము - ప్రథమ సర్గము, 65)

శ్రీరామ - శ్రీకృష్ణ - అవతారము లందు వలె శ్రీసాయీ అవతారమునందు నామ- నామినుల కట్టి మహాత్త్వము కలిగినది. అట్టిశక్తి ఒకరిచ్చినదికాదు. స్వతస్సిద్ధముగ కలిగినదే అది ఈశ్వరేచ్ఛ. నామికంటె నామమునఅద్భుతశక్తి గలదు. నామి చేకూర్పఁజాలనిది నామము చేకూర్పఁగలదు. సాకార బ్రహ్మము- నామి- అవతార సమాప్తి నొంది యదృశ్యమైనను నామము మాత్రము చిరస్థాయిగ నిలుచును. నామియందున్న శక్తులకంటె నామము నందు అధిక శక్తులు గలవు. నామ బలమున నామి ఆకర్షింపఁ బడును. నామి కంటె నామమే జీవిని ఘోర సంసార పారావారమును దాటింప సమర్థమైనది.

బాబా 40 సంవత్సరములకుఁ బూర్వము భౌతిక దేహము విడిచి నాఁడు గదా? మనల నెట్లుద్ధరింపఁ గలఁడని సందియమొందఁబనిలేదు. నామబలమున-ఏక్షణమున భక్తుఁడు పిలుచునో ఆక్షణమున భక్తునిఁ జేరి రక్షణ మొసఁగును. భౌతిక దేహము నందున్నప్పటికంటె మిక్కిలిగ, భౌతిక దేహము విడచిన తరువాత తన ఆశ్రితుల కెల్ల వేళల నెల్ల విధముల రక్షణ మొసఁగఁగలఁడు. ఆ 'సాయీ' నామము నందలి బీజాంకుర సంపుటీకరణ మాహాత్మ్యము అద్భుతము. అనుభవైక వేద్యము. 'సాయీ' నామము స్మరించుటకు పలుకుటకు ఎంత స్వాదువు - ఎంత హృద్యముగ నుండునో దానిని రుచి చూచినవారికే వేద్యము. ఈవిషయమును గూర్చి శ్రీసాయీ స్మరణము నందిట్లు పలికితిని.

ఏ యయ్యల్ ముదమారఁగా నిడిరొ నీకీపేరు! సుశ్రేయమై
ధ్యేయంబై సకలార్థదంబయి రసాధిష్ఠానమై శ్రావ్యమై
హాయిం గూర్చుఁ దలంచినన్ వినిన నోరారన్ జపింపంగ నీ
'సాయీ' ద్వ్యక్షర మెల్ల జీవులకు విశ్వంబాదు శిర్డీశ్వరా!

* * * * * *

బాబా! 'సాయి' పదంబు నీక తగు నన్వర్థాభిధానంబునై
ప్రాబల్యంబును గాంచు నెల్లెడ సమర్థం బౌచు సందేహమే
లా? బీజాక్షర సంపుటీ కరణ మాహాత్మ్యం బగమ్యంబు; స
త్తా బాహుళ్య మచింత్యమై పఱఁగు నంతర్యామి! శిర్డీశ్వరా!

(శ్రీ సాయి బాబా పూజాస్తవములు - శ్రీ సాయి స్మరణ.)

కీ॥ శే॥ పూజ్యశ్రీ. బి. వి. నరసింహస్వామిగారు ( President, All India Sai Samaj ) శ్రీ సాయీ నామమే దొకరూపమున భక్తులు స్మరించి తరించుటకు వివిధ పురాణాదు లందుఁగల భగవానుని స్తోత్రములను శ్రీ సాయీ నాథుని పరముగ సమన్వ యించుచు నామా శ్లోకాముల నేర్చి కూర్చి ' సాయీ నాథ మననము ' అను పేర ప్రచురించిరి. దానిని తెలుఁగుఁ బలుకుమని నాకాన తిచ్చిరి. (ఆవిషయము తొలుత వచించితిని.)

సాయీ మననము రచించు సమయమున నొక పట్టున "దీనిని నేనురచింపఁగలనా"? యని సంశ యించితిని. ఆ రాత్రి స్వప్నము-ఒక సభ జరుగు చున్నది. పలువురు భక్తులుచేరిరి. బాబా వచ్చు చున్నాఁడని ఎవరో చెప్పిరి. అంతలో సాయీ ప్రభువు రానే వచ్చెను. బాబా పాదముల వ్రాలి మ్రొక్క-తిని. అభయ హస్తమున బాబా స్పృశించెను. బాబా అగ్రాస నాసీనుఁడయ్యెను. ఆసభలో నన్నుపన్యసింపుమనిరి " బాబా! నీయెదుట నేను పలుకఁగలనా ? సాహసముగాదా ? నేనేమి పలుకఁగలను?"– అని మనవి చేసికొంటిని. బాబా చిఱు నవ్వు నవ్వి " బిడ్డా! ఏమి భయము లేదు. నేను నీ ప్రక్కన నుండ జంకనేల? పలుకుము–సంశయ పడకుము"-అని చెప్పెను. అంత " దర్శనా దేవ సాధవః " – " సాధు సందర్శనము మాత్ర సకల మొదవు " అను మాటలు నానోటినుండి వెడలినవి. నిద్ర మేల్కొంటిని. కావున నివి యన్నియు బాబా

పలికించిన పలుకులుగాని, నాసమర్థత లేశమేని లేదని మనవి చేయు చున్నాఁడను.

స్వోదర కుటుంబ పోషణకై వ్యయ పెట్టఁ దగిన కాలముగతించినను శేషించిన కాలము నేలవమైనభగవంతునిఁ గీర్తించి మానవులు తరించుటకే పూర్వీకులు, సర్వ జనోద్ధర ణాభి లాషులగు వ్యాసాదులు పెక్కు పురాణముల రచించి యాయా తావుల భగవంతుని స్తోత్రములఁ గూర్చిరి. ఏరూప మున నైన భగవన్నామము స్మరించి నరులు తరించ వలయు ననియే వారి యాశయము. శ్రీరామ – శ్రీకృష్ణ– శ్రీసాయీ మొదలగు పదముల భేదములను పాటింపక తచ్ఛబ్ద వాచ్య మగు నేవస్తువు గలదో ఆవస్తువునే దృష్టి యందుంచికొని మనస్సును ప్రాపంచకాభి ముఖముఁ గానీయక దైవాభి ముఖము చేయుటయే ' మననము ' యొక్క యుద్దేశము. సాధన చతుష్టయములో 'మననము' రెండవది. పెద్దలవలన వినిన యర్థమును (శ్రవణమును) గూర్చి చింతించుటయే 'మననము'. దానివలన 'నిధి–ధ్యాసలు' అలవడును. దాని మూలమున పరవస్తువు నెఱిఁగి పడయుటకు జీవి పాత్రుఁ డగును.

శ్రీ భగవానుని కరుణామృత రస ప్రవాహము సర్వదా సర్వథా ప్రవహించుచునే యుండును. సుకృత లేశము గలజీవి యంజలి పుటమునుబట్టి యా యమృత రస మును గ్రోలి తరించుచుండును. అభాగ్యుఁడు దాని దఱిఁ జేరక ఖాత కోదకములఁ గ్రోలుచుండును.

'నామ స్మరణా దన్యోపాయం నహి పశ్యామో భవ తరణే' సంసారసాగరమును తరించుటకు భగవానుని నామ స్మరణముకంటె వేఱుమార్గము లేదు. ఏదొక రూపమున శ్రీ సాయీ నామమును స్మరించి తరించుటకే శ్రీ సాయీ మననము తెనుఁగునఁ బలికి సోదర భక్తులకు సమర్పించు చుంటిని.

## శ్రీ సమర్థ సద్గురుదేవుఁడు సాయీప్రభువు భక్తుల నుద్ధరించు విధము.

### అవతారములు — సమర్థ సద్గురువులు

సాధు సంరక్షణము ధర్మస్థాపనము కొఱకు భగవానుఁడు ఆయా దేశముల నాయాకాలముల నవతరించు చుండును. ఈ యవతారము లేయొకటి-జీవినో యుద్ధరించు పని పూనవు. మానవ ప్రపంచమున అధర్మమును రూపు మాపి ధర్మమును సంస్థాపించుట వాని ప్రధానకార్యము. అట్టి యవతారములకు సహాయభూతులై వారి పనులందుఁ బాల్గొనుటకు సమర్థ సద్గురువు లుద్భవింతురు. ఆ భగవానుని అపార సామర్థ్య జ్ఞానానందముల వారు వడసి, ప్రపంచమున నాయాజీవులఁ జేరి వారిని సముద్ధరించు చుందురు. భగవ దవతారములకు వీరు భిన్నులు కారు. ఆ యవతార మూర్తుల సేవించిన నెట్టి ఫలమో సమర్థ సద్గురువులను సేవించినను

ప్రాప్తఫలమే జీవులకుఁ గలుగుచుండును. అపార సచ్చిదానంద పూర్ణులగు సమర్థ సద్గురువులలో 'శ్రీ సాయీ బాబా' నొకఁడు. అవతారమనిన సమర్థ సద్గురువనిన - ప్రత్యక్ష దైవమే కాని వేఱు కాదు. అని మనము రూఢిగ తెలిసికొనఁ దగును. జీవిని 'సత్' శబ్ద వాచ్యుఁడగు పరమాత్మను బ్రాపింపఁజేయఁ జాలిన సమర్థుడు కావున 'సద్గురువు' అని పిలువఁబడుచున్నాఁడు.

సమర్థ సద్గురువు జీవేశ్వరుల కైక్య విధానమును ప్రాప్తింపఁజేసి జీవిని బంధ విముక్తునిఁ గావింపఁ గలఁడు. ఈ సృష్టియందుఁగల జీవులెల్లరు నొకజన్మమునుండి మరియొక జన్మము పడయుచుందురు. జీవి పరమాత్మయే యయ్యు మాయాబలమున విడివడిన వాఁడయ్యెను. జీవులు వారి వారి కర్మ పరంపరలచే అజ్ఞాన మంతకంత కధికమగుటవలన ఈ సంసార చక్రమున నతివేగమున పరిభ్రమించుచుందురు. దీనినుండి విడివడుటకు జీవులకు సామర్థ్యము లేదు. వారివారి కర్మ వాసనలచే ప్రేరేపింపఁబడి యంతకంత కెక్కుడుగ కామాసక్తులగుదురు. కర్మవాసనా రూపమగు సంసార చక్రము జీవులను దన పిడికిటఁ బట్టియుండును. నిస్సహాయులగు జీవులు విడివడనేరక వనరుచుందురు. విడివడుటకు ప్రయత్నముఁ గావించువారయ్యు, నంతకంత కధికమగు బంధములఁ గల్పించుకొనుచు నీ సంసారచక్రమున పరిభ్రమించుచుందురు. అట్టి బంధములనుండి జీవులను ముక్తులఁ గావింపఁ

జాలినవారు భగవదవతారులు, తదభిన్నులగు సమర్థ సద్గురువులు. దైవముకంటె అవతారమెట్లు భిన్నముకాదో అవతారముకంటె సమర్థ సద్గురువు భిన్నుఁడు కాఁడు. కావున సమర్థ సద్గురువు 'ప్రత్యక్ష దైవము' - 'అపాంతరాత్మ' - అగుచున్నాఁడు.

ఇట్టి సమర్థ సద్గురువుల శక్తిసామర్థ్యములు ప్రపంచ దృష్టినిఁ జూచువారికి, మాంత్రికుల, గారడీల, ఇంద్రజాలికుల శక్తులవలె గోచరించును. ఈ రెండు తెగలవారి సామర్థ్యములు-పుట్టువు, స్వభావము, పరిమాణములు, ప్రయోగ కారణాదులచే భిన్నము లగుచున్నవి. ఐంద్రజాలికులు మొదలగువారు వారివారి శక్తుల నతి ప్రయాసమున నార్జింతురు. ఆశక్తులు దేశకాలాదులచే పరిమితములు. అట్టి శక్తిప్రదర్శనములు స్వప్రయోజన మూలములు. సమర్థ సద్గురువు లట్టి శక్తులకై ప్రయాస పడవలసిన పనిలేదు. అవి వారివారి పరిపూర్ణ స్థితిప్రాప్తిచే సహజముగ కలుగునవి. వానిని ప్రదర్శించుటకు వారు కష్టపడవలసిన పనిలేదు. ఆశక్తులే వారి తెగకు - తరగతికి మాత్రము సంబంధించునవి కావు. అష్టసిద్ధులని చెప్పఁబడు "అణిమాదిసిద్ధులు" సైతము సమర్థసద్గురువుల శక్తులతో సరిపోల్పఁదగవు. సమర్థ సద్గురువు లాయా జీవులయెడ ప్రదర్శించు అద్భుతశక్తులు కేవలము అవ్యాజ కరుణా హైతుకములు. కాని మఱియొండు విధము కాదు.

అట్టి సమర్థ సద్గురువుల కరుణకుఁ బాత్రమైనజీవి క్రమముగ పరమాత్మ ప్రాప్తియందు దున్నత స్థానము పడయుచుండును.

స
క
ః

## సమర్థ సద్గురువులు—వారిపద్ధతులు

సమర్థ సద్గురువులు జీవుల నుద్ధరించు విధానములఁ బరిశీలింతము. సమర్థ సద్గురు దర్శనభాగ్యము జీవి తన 'ప్రవృత్తి' మార్గమును వదలి 'నివృత్తి' మార్గమున కభిముఖ మయ్యెనని తెలుపును.

జీవి జీవత్వమేల పొందెను? స్వస్వరూపమును – 'తాను బ్రహ్మము' – అను ఎఱుకను గోల్పోయి పరివర్తిత గుణబద్ధుడై – జీవియై సంసారమునఁ జిక్కువడినాఁడు. ఆది యందుఁ గల బ్రహ్మస్థితి వీచీతరంగాది రహిత ప్రశాంత సముద్రమువంటిది. గుణ క్రమ భిన్నము – ఆ ప్రశాంత సముద్రములోని చిన్నసుడి – (అల) – ఈ సుడి (అల) యే జీవి. అదియే తొలుత అజ్ఞానము. ఆ సుడి – జీవి – తాను ప్రశాంత సముద్రమునకు భిన్నమను భావమేర్పడి, తన్ను వేఱుగఁ జూచినాఁడు. సద్గురువు ఆజీవి భిన్నత్వాస్థితికిఁ బూర్వమునఁ గల స్థితి నెఱుకపఱచును. ఆసుడి (అల) కి పూర్వము తరువాత జలమనియే సద్గురువు బోధపఱచును. ఆ సత్యము నెఱిఁగిన – (అల) – జీవి – ఆశాంత సముద్రములోని భాగముగఁ దెలిసికొని ప్రశాంతి నొందును. పూర్వ ప్రశాంతిని

సద్గురువు అనుగ్రహమునఁ బడయును. ఇది సద్గురువు చేయు కార్యము. ఆవిధానముఁ బరిశీలించుదము.

## ప్రథమ సహాయము :

జీవి తన పురాకృత కర్మభారమున కుంగియున్నాడు. ఆ కర్మభారము వానిని కుంగఁదీసి సంసారమున నంటఁ బెట్టునది. జీవి తాను విత్తిన సుఖ దుఃఖ ఫలముల ననుభవింపవలయును. ఒక బరువును దింపుకొనఁ బ్రయత్నించు జీవి మఱి రెండు క్రొత్తబరువు లెత్తుకొను చున్నాఁడు. ఇట్లు క్రమముగ కర్మములఁ బెక్కుగావించి భారాధిక్యతఁ బొందు చుండును. వాని హృదయ దౌర్బల్యము - విస్పష్ట దృష్టి లేమి - వానిని సరియగు మార్గము నెఱిఁగి యామార్గమునఁ బ్రవర్తింపనీయదు. ఆ జీవికి యథార్థస్థితిఁ దెలిపి, వానినిఁ జక్కదిద్ది, సరియైన మార్గమున నడిపింపఁ గలవాని సహాయము కావలయును. అట్టి నిర్దేశకుఁడు నియంతయు నగు వాఁతఁడే సద్గురువు. ఈ కర్మబద్ధుఁడగు జీవికి అట్టి సద్గురువు నేవిధముగ నాశ్రయింపవలయునో అదియును దెలియదు. ఆ జీవి పురాకృత పుణ్య లేశముననో - పూర్వ భవముల సాధు దర్శన స్పర్శన సంభాషణ సేవాభాగ్య విశేషముననో సద్గురు వట్టివానిపై తన నిర్హేతుక ప్రేమ నెఱపి, వానికిఁ దన్నుఁజేరు నవకాశముఁ గల్పించును. అట్టి యదృష్ట పరిస్థితులలో సుకృత లేశము వడసిన ఆ జీవిని సంసార భయద చక్ర భ్రమణమునుండి సద్గురువు తప్పించును. ఆ సద్గురువు

నందా జీవికి ప్రేమ గౌరవ కృతజ్ఞతలు జనించును. ఇతరజీవు లకు ఆ సద్గురువునకుఁ గల భేదము గోచరించును.

## అనంతర సహాయము ;

ఈ విధముగ జీవి సమర్థ సద్గురువునందు మనస్సు నిలిపి ప్రేమింప మొదలిడును. వీని ప్రేమ కనుగుణముగ సద్గురువు తన యపార కరుణాప్రేమ శక్తి సామర్థ్యముల నాజీవిపై నంతకంత కధికముగఁ బ్రకటించును. ఆ సద్గురువు కరుణ ఆ జీవిని పాపకర్మలకు విముఖునిఁ గావించి, పుణ్య సంపదలఁ బెంపుఁగూర్చు నేవియో కొన్ని మంచిపనులఁజేయఁ బనుచును. మంచిపను లెక్కువ చేసిన కొలఁది జీవి పాప కర్మ భారము తగ్గించుకొనును. ఆ సద్గురు కరుణాలేశము అట్టి జీవిని పురాకృత సంచితాగామాది కర్మఫలముల ఈ జన్మ మందే తోడ్తో స్వల్పముగ ననుభవింపఁజేసి కర్మ పరి పూర్ణము చేయును. ఈ యెడ జీవి యితోఽధిక పుణ్య కర్మముల నిష్కామబుద్ధితోఁ గావించును. అట్టి సత్కర్మ ములు తమో రాజస గుణములనుండి జీవిని దూరముచేసినను సత్వ గుణముచే బద్ధునిఁగావించి యుత్తమజన్మలఁ గూర్చి దేవాదిలోక సుఖము లనుభవింపఁ జేయును. ఈ సాత్విక బంధము సైతము ప్రిదులవలయును.

కావున సద్గురువు జీవిని పుణ్యకర్మవుల నుండియు విముక్తునిఁగాఁ జేయును. జీవి యట్టి పుణ్యకర్మను లొనర్చుట

కంటె నున్నతస్థితియందు - పరమాత్మ ప్రాప్తియందు దృష్టి కలిగి యుండవలయును. సద్గురువును నెఱనమ్మి, ప్రేమించి, సర్వ సమర్పణము గావింపవలయును. సంపూర్ణ శరణాగతిఁ జేయనగును. సద్గురువునందు మనసు లయము చేయుట మంచిదే - కాని, ప్రాథమిక స్థితియందుఁ దాను గురువును ప్రేమించి, తన కుచితమగు సేవ కావించుచుఁ దానేవో కొన్ని ప్రశంస నీయములగు సత్కార్యములఁ గావించు చున్నాఁడ నను తలఁపు గలిగించును. అది క్రమముగ స్వార్థ రహిత బుద్ధిని సమకూర్చి, కర్మఫలము నాదపేక్షను దొలఁ గించును. అతని అజ్ఞానము పూర్తిగఁ దొలఁగదు. తానొక నిమిత్త మాత్రుఁడనని, తాను సద్గురు ప్రేరణచే నాయా పనులఁ గావించుచున్నాఁడనని తలంచును. ఈ భావనకూడ జీవికి తొలఁగ వలయును. సర్వార్పణముఁ గావించి తాను గురువునందైక్యము నొందవలయును.

## ఆత్మార్పణము—ఐక్యము :

ఈరెండు నొకటియే. భేద మతిస్వల్పము. ఆత్మార్పణ మున జీవి తన అకించనత్వమును బ్రదర్శించును. అహంతను బోఁద్రోయును. ఐక్యతాస్థితి కవి యవసరములేదు. ఐక్యత ఆత్మార్పణఫలము కావచ్చును. కాని దానికారణము గాఁజా లదు. ఐక్యత ఫలము జీవి తాను వేఱు - అను భావనఁ గలి గించు మాయను శమింపఁ జేయుటయే. ఆత్మార్పణము గుణ

సామరస్యమును గూర్చి, జీవస్థితి నొందినప్పటి చంచలత్వ, దొలఁగించి ప్రశాంతస్థితిఁ జేకూర్చును.

## ఆత్మార్పణము :

సద్గురువునందు భక్తి పెంపొందిన జీవి ఆత్మార్పణము గావించును. ప్రపంచమంతయు నావరించిన విద్యుద్యంత్రము విద్యుదణువు నాకర్షించువిధము దీనికిఁ బోల్పనగును. విద్యుదణువగు భక్తుఁడు విద్యుద్యంత్రమగు సద్గురువు శక్తిచే తాను తనస్థితినుండి ముందుకు జరుగుచున్నట్లు భావించును. 'అట్టి స్థితిలో ఆత్మార్పణ మెట్లు గావింపనగునా'? - యని భక్తుఁడు తలంచవచ్చును.

ఈ విషయము మఱియొక విధముగఁ బరిశీలింతము. జీవియగు భక్తుఁడు ప్రథమమునఁ దాను తన గురుదేవుఁడు భిన్నులమను తలంపున (గురువు తన దేహమునకు వెలుపల నుండెననుబుద్ధితో) గురువునందు భక్తి చేయుచుండును. అట్టి స్థితిలో జీవి రజస్తమో గుణబద్ధుఁడై, దేహబుద్ధి గలిగి (దేహమే తానను బుద్ధిగలిగి) యుండును. సద్గురు సేవచే భక్తి పెంపొందిన కొలఁది, నిష్కామ స్వార్థరహిత సత్కృతులు పొనరించిన పిదప, రాజసిక తామసిక భావములు శమించిన జీవికి దేహాత్మబుద్ధి నశించును.

పిదప దైవమునుగూర్చిన తలంపులు విరివియై, గురు దైవముల ఆధ్యాత్మిక తత్త్వ ప్రమాణము విస్తృతినొంది,

ఆవరణ శూన్యమై విశ్వ వ్యాప్తినొందును. గురు దైవమును దేహమాత్రునిగఁ బరికింపఁడు, విశ్వాంతర్యామిగ గుర్తించును. సర్వ భూత హృదయాంతర్వర్తిగ గురువు తోఁచును. ఆ భక్తుఁడు (జీవి) తన హృదయమందు సద్గురువును జూడ నేర్చును. తన హృదయాకాశమున గురుదైవమును జూచును-అనుభవించును-ఆనందించును. సమర్థ సద్గురువు తన అపార మహిమచే తన ఆశ్రితునకు యథార్థ స్వరూపము నెఱుక పఱచును. హృదయాంతర్గతుఁడగు సద్గురు వేక్షణమందేని చైతన్య రహితుఁడుగ (స్తబ్ధుఁడుగ) నుండఁడు. గురుదేవుని సన్నిహితత్వ దృఢభావ మాజీవి జీవత్వమును గ్రమముగ గ్రసించును. ఇదియే యితరుల దృష్టిలో జీవి చేయు ఆత్మార్పణము. సకల పురాకృత శుభాఽశుభకర్మములు (ఆగామి సంచిత ప్రారబ్ధములు) ఆయాత్మార్పణముచే గ్రసింపఁబడుచున్నవి.

## తుది మెట్టు :

జీవి అభ్యున్నతస్థితికిఁ (గమ్యస్థానమునకు) జేరుటకు కర్మములు నశించినమాత్రము చాలదు. కర్మవాసనయు (తిరిగి కర్మములు చేయవలయునను తలంపును) నశింపవలయును. ఐహికాముష్మిక సంబంధములగు విషయములు పొందవలయునను కోరికయే 'వాసన' యనఁబడును. ఈవాసనను మిక్కిలి బలీయము - పవిత్రము - నిర్మలమగు ప్రేమ (ప్రపంచక ప్రేమకంటె భిన్నమైన - ఉత్తమప్రేమ) చేతనే

గ్రహింపవలయును. ఆ ప్రేమ యిదివరలోఁ దెలుపఁబడిన గురుదేవునియందు ప్రేమయే యట్టి పనికిఁజాలినది. ఆ ప్రేమయే సంపూర్ణాత్మార్పణ స్థితిగ పరిణమించును. అట్టి ఆత్మార్పణమే కర్మవాసనను సాంతముగఁ దొలఁగించును. వాసన నశించిన అజ్ఞానమింక కలుగఁబోదు. భయంకర సంసార చక్ర భ్రమణమింక లేదు. జీవి పరమాత్మయందు లీనమగు స్థితి పూర్తియగును. సమర్థ సద్గురుఁడు తన వెలుపల నున్నట్లు భావించిన జీవి ఆస్థితిలో వెలిని, లోపల ఎల్లయెడల నున్నట్లెఱుఁగును. జీవి, సద్గురువు, పరమాత్మ 'ఏకము, సత్యము,' అను ఎఱుక గలుగును. ఇదియే పరమార్థము.

"అవతారంబులు-సద్గురూత్తములు, ప్రత్యక్షంబునా దైవ; మ ట్లవుటన్ వారికొలందు లెన్నఁదగ, దవ్యాజాను రాగాన నే కవిధిన్ జీవులనుద్ధరించుటకు లోకంబందు వర్తింతుర్; వా రెవరేన్ బ్రాప్యులటంచుఁ దెల్పనొకొ? ఏమో, నిన్నుపే క్షింతునా?"

సమర్థ సద్గురుదేవు - శ్రీ సాయీప్రభు నామస్మరణ మననములకంటె జీవికి తరణోపాయము లేదు. కావున నా యథాశక్తిని శ్రీ సాయీనాథుఁడు పలికించిన విధమున ఈ కృతినిఁ బలికి సోదర భక్తులకు సమర్పించితిని. ఇందలి గుణ ములను మాత్రము గొని దోసములను విస్మరించి నన్ను కృతకృత్యునిఁ జేయుఁడని భక్తజనుల నెల్లఱను వినయమునఁ బ్రార్థించువాఁడను.

శ్రీ సాయీప్రభువు సంపూర్ణానుగ్రహము వడసి, బాబానుగూర్చి పలుగ్రంథముల రచించి ప్రచురించి, అఖిల భారత సాయీ సంఘాధ్యక్షుఁడై శ్రీ సాయీనాథుని అనుగ్రహము దక్షిణ భారతీయు లందఱకు ప్రసరింపఁజేసి కీర్తికాయులైన పూజ్యశ్రీ బి. వి. నరసింహస్వామిగారికి అనేక ధన్యవాదము లర్పించువాఁడను.

ఈ కృతిని శ్రీ సాయీభక్తుల కెఱుకపఱచి, ఆశీస్సులుప్రసాదించిన శ్రీసాయీ భక్తాగ్రగణ్యులు-పూజ్యశ్రీ స్వామి కేశవయ్యాజీ గారికి (షిన్నాయ్‌నగర్ - మద్రాసు) నా కృతజ్ఞతాభి వందనములు సమర్పించు చున్నాఁడను.

నా యీ జీవితమున బాల్యదశయందే అధ్యాత్మిక ప్రబోధము కల్పించిన చిరకాల ఆప్తుఁడగు శ్రీ బందా ఆదినారాయణగారికి అనేక నమస్కృతు లర్పించు వాఁడను. నా యందవ్యాజప్రేమ వహించి శ్రీ సాయీబాబా కృతుల ప్రచురణమునకు సర్వవిధముల ప్రోత్సహించుచున్న మిత్రములగు చి॥ శ్రీ రావుల దేవేంద్రనాథము పంతులు గారిని (పేరాల) చి॥ శ్రీ వేమూరి వెంకటేశ్వర్లుగారిని (Advocate Repalle) శ్రీ సాయీప్రభువు సర్వదా సర్వథా రక్షించు గాత మని ప్రార్థించువాఁడను.

కృతి ప్రచురణ విషయము :

శ్రీ సాయీప్రభువు అనుగ్రహలేశమున 1944 సంవత్సరము నుండి బాబా పలికించిన విధమున ఏవియో కొలఁది కృతులు పలికినాఁడను. గ్రంథములు పలుకుట లోకఎత్తు. వానిని ప్రచురించుటలు మఱియొకయెత్తు. మొదటిది బుద్ధిసాధ్యము. రెండవది ధనసాధ్యము. రెండును దైవాధీనములే. బాబా పలికించిన కృతులలో నేది ముందవసరమో దానిని ముద్రింపింతునని నా మిత్రుఁడు శ్రీ రావినూతల శ్రీ రాములుగారు (Head master-B. H. School వల్లభాపురము తెనాలి తాలూకా) నాకుఁ దెలిపిరి. బాబాభక్తులు నిత్యము పూజించి ధ్యానించుటకు 'శ్రీ సాయీబాబా పూజాస్తవములు' ముద్రింపించుఁడని కోరియుంటిని. వారు మాట నిచ్చిన ప్రకారము 1-7-57 నాటికి వేయిప్రతులు ముద్రింపించి నాకొసఁగిరి. శ్రీ సాయీలీలా ప్రచురణములలో రెండవకృతి 'శ్రీకృష్ణ కర్ణామృతము' నామేనత్తగారి కుమారుఁడు చి॥ శ్రీ ఆదిపూడి శ్రీకృష్ణమూర్తి (A. S. Krishna. Guntur) వేయిప్రతులు ముద్రింపించి సహాయముచేసెను.

1957 సంవత్సరము సెప్టెంబరు నెల 'సాయిసుధ' మాస పత్రికలో శ్రీ డి. భీమారావుగారు (President All India Sai Samaj Madras) 'శ్రీ సాయీబాబా పూజాస్తవములు' గ్రంథమును గూర్చి (Review) విమర్శ ప్రచు

రించి గొప్ప సహాయము చేసిరి. దానిని చదివిన బాబా భక్తులు ఆయా జిల్లాలలోనివారు తక్కిన కృతులుగూడ ప్రచురింపుడని ప్రోత్సహించిరి. ఇదియు శ్రీ సాయీప్రభు ప్రేరణయే యని నాఅసమర్థతను వారలకుఁ దెలిపియుంటిని. అచ్చుకావలసిన కృతులలో ముందు శ్రీ సాయీమననము ముద్రింపించుటకు సంకల్పించితిని. దానికి షుమారు రు 450/-లు అంచనా వేయబడినది. 45 గురు పోషకులు రు 10/-లు చొప్పున ధన సహాయము చేసిన శ్రీ సాయీ మననము ముద్రింపించి శ్రీ సాయీబాబా భక్తసమాజములకు - పూజామందిరములకు-భక్తులకు సమర్పింతునని మనవి చేసియుంటిని. ఆయాజిల్లాలలోని బాబా భక్తులు పలువురు ఉత్తరములువ్రాసిరి. షుమారు 250 మంది భక్తులకు, వారు తెలిపిన వారలకు, భక్తసమాజములకు శ్రీ సాయీబాబా పూజాస్తవములు 600 ప్రతులు శ్రీకృష్ణ కర్ణామృతము 300 ప్రతులు ఉచితముగ అందించి శ్రీ సాయీమననము ముద్రణమునకై సహాయ మర్థించితిని. వారిలో పోషకుల పట్టియందు దెలిపినవారు పలువురు ధనసహాయము చేసి యుండిరి. అందు కొందరు మాత్రము వాగ్దానములు చేసిరి. వారందరిలో పశ్చిమగోదావరి జిల్లా - కె. ఇల్లిందలపర్రు వాస్తవ్యులు శ్రీ పొడిల విశ్వనాథశర్మగారు అత్యధికప్రేమ ఆదరణములు చూపి శ్రీ సాయీ మననమునకుఁ బలువురు పోషకులఁ జేర్పించుటయే కాక, సామాన్య గృహస్థులై యుండియు వారు రు 116/-లు పంపినారు. వారి త్యాగము

నకు నేను ముగ్ధుఁడనైతిని. ఇది యేనాటిసంబంధమో యిట్టి ప్రియసోదరుని సమకూర్చిన శ్రీసాయీప్రభువునకే యెఱుక! ఈకృతుల కారణమున మన ఆంధ్రదేశమునఁ గల పలువురు బాబాభక్తులతో ఉత్తర ప్రత్యుత్తర రూపమునఁ జెలిమి చేసి ఆనందింపఁ గలిగితిని. శ్రీ సాయీభక్తుల సాంగత్యమున కంటెఁగోరఁదగిన భాగ్యములీ ప్రపంచమున లేవుగదా! ఇది యంతయు శ్రీ సాయీనాథుని లీల.

బాబా-ధనహీనుఁడనగు నాచే ఈకృతిరూపమగు సేవ చేయింపఁదలంచెను. శ్రీ సాయీప్రభువే యీ పోషకుల నందఱ నేరికోరి తెచ్చికొనినాఁడు. పోషకులఁ జేర్పించుటకు పైని తెలిపిన పుస్తకములు భక్తులకందించుటకు పోష్టుఖర్చులకై తేనేమి, రాకపోకలకు రైలుబండ్ల ఇతరఖర్చులకై తేనేమి రు 200/-లు పైగా వ్యయము చేయవలసి వచ్చినవి. శ్రీ సాయీమననము ముద్రణమునకు ధన సహాయము చేసిన పోషకులందఱకు నా కృతజ్ఞతాభి వందనము లర్పించుచు వారి నెల్లఱను సర్వనియంతయు - సర్వవ్యాపకుఁడు సర్వసమర్థుఁడగు శ్రీ సాయీనాథుఁడు చిరాయురారోగ్య భోగ భాగ్య మహాభివృద్ధుల ప్రసాదించి, యెల్లవేళల రక్షించుగాత మని ప్రార్థించువాఁడను.

* * * * *

పలుకన్ వచ్చు ప్రియోక్తులెన్నయిన, ద్రవ్యత్యాగముల్
మాటలా ?

కలదో-లేదో-యెఱుంగ; నీకృతినిఁ జక్కన్ సాకినారీ వదా
న్యులు-నీబిడ్డలు; వీరిఁ, బోషకుల నాయుర్భోగ భాగ్యప్రపూ
ర్ణులుఁగాఁ జెక్కతరాలు ప్రోవఁగదె! బంధూ! సాయినాథ
ప్రభూ !

“ లోకాస్సమస్తా స్సుఖినో భవంతు! ”

ఓమ్ శ్రీ సాయీ !

ఇట్లు విన్నవించు,

భక్తజన విధేయుఁడు

బాపట్ల హనుమంతరావు

చిన్నగంజాము
21—8—58



# శ్రీ సాయీ నాథాష్టకము.

అనంతా తులా తే కసేరే స్తవావే । అనంతా తులా తే కసేరే నమావే
అనంతాముఖా చా శిణే శేష గాతా । నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా!

స్మరావే మనీ త్వత్పదా నిత్య భావే । ఉరావే తరీ భక్తి సాఠీ స్వభావే
తరావే జగా తారునీ మాయ తాతా । నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా!

వసే జో సదా దావయా సంత లీలా । దిసే అజ్ఞ లోకాపరీ జో జనాలా
పరీ అంతరీ జ్ఞాన కైవల్య దాతా । నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా!

బరా లాధలా జన్మహా మానవాచా । నరా సార్థకీ సాధనీ భూత సాచా
ధరూ సాయి ప్రేమా గళాయా అహంతా । నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా!

ధరావే కరీ సాన అల్పజ్ఞ బాలా । కరావే అమ్హా ధన్య చుంబోని గాలా
ముఖీ ఘాల ప్రేమే ఖరా గ్రాస అతా । నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా!

సురాదీక జ్యాంచ్యా పదా వందితాతీ । శుకాదీక జ్యాతే సమానత్వ దేతే
పదీ నమ్రతా యే ప్రయాగాది తీర్థే । నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా!

తుఝ్యా జ్యా పదా పాహతా గోపబాళీ । సదా రంగ విచిత్ స్వరూపీ మిళాలీ
కరీ రాసక్రీడా సవే కృష్ణనాథా । నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా!

తులా మాగతో మాగణే ఏక ధ్యావే । కరా జోడితో దీన అత్యంత భావే
భవీ మోహనీ రాజ హా తారి అతా । నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా!

ఓమ్ శ్రీ సాయీ!

---

ఓమ్.

శ్రీ వేంకటేశాయనమః.

శ్రీ సాయీనాధాయనమః.

# శ్రీ సాయీమననము

( ప్రథమ సర్గము. )

## మంగళాశాసనము

శ్రీవేంకటేశ ప్రసిద్ధ స్వరూప గో
పాలసద్గురు కృపావర్ధితంబు,
క్షేత్రతీర్ధవిశిష్ట శిర్డీపురస్థిత
ద్వారకామాయీప్రభాసితంబు,
చంద్రోర్కరాది ప్రశస్త భక్త సమార్జి
తైహికాముష్మి కాప్యాయనంబు,
ప్రాణిహితంకర పరమేశ దివ్యావ
తార రహస్యప్రచారకంబు,

సగుణ నిర్గుణోపాసనాసక్త ఫలము
వేదవేదాంత సిద్ధాంత విస్తృతంబు
సర్వసౌలభ్య, మార్త రక్షణ సమర్థ
మగుచు "శ్రీ సాయిలీల" యీజగతి వెలయు.

# శ్రీ సాయీనామ నిర్వచనము

సర్వకారణమును సార్వవర్ణకమునై
తెలుపు 'స' వర్ణము తొలుతనిలిచి,
ఆకర్షణాత్మకమైసర్వగతమునై
'ఆ' కారమదితోలిహల్లుకమరు,
క్రిమతసర్వవ్యాపకంబును పావన
మై 'య' కారంబది యవలఁబొలుచు,
వాక్ప్రసాదకరముఁబరమనిర్మలమునై
'ఈ' కారమటుపైని నెసఁగుచుండు,

పుష్టి హృష్టిద 'మి' త్వమేక బొసఁగు నూద.
నిగమ నిగమాంత వేద్యమై నెగడు నిదియ,
అఖిల పురుషార్థ సాధకమై వెలుఁగు
ద్వ్యక్షరాత్మక "శ్రీ సాయి" తారకంబు. **2**

క్షీరసాగర స్థాయి శ్రీ శేషశాయి,
ప్రణతులకు 'తాయి' శ్రీ వటపత్రశాయి,
ప్రవిమలార్థ ప్రదాయి శ్రీరంగశాయి,
మహిత శుభదాయి 'ద్వారకా మాయి సాయి'. **3**

## అంజలి

శ్రీమనోజ్ఞనారాయణ నామజపము
నిండు మోదంబునఁ బొనర్చుచుండు మనమ !
జగతి ధర్మార్థకామమోక్షములు వడయ
సాయినాథ పదాంబుజాశ్రయముఁగనుమ. **4**

సాశ్రితాభయప్రదుని, బ్రసన్నవదను,
నమల పీతాంబరధరు, శశాంకవర్ణు,
విశ్వవంద్యుఁ జతుర్భుజు విష్ణు, నెపుడు
నఖిల విఘ్నప్రశాంతికై యాశ్రయింతు. 5

ఎవఁడు కరుణించు నెడ మూఁగ యేనిఁ బలుకు
నెవఁడనుగ్రహించిన మృతుఁడేని బ్రతుకు,
నాదయామయు, భక్తజనానుయాయు,
శీర్డివాసు, సాయీశు, భజింతు సతము. 6

శ్రితజనంబుల నెల్ల రక్షించు పొంటె
నవతరించి, శీర్డిగ్రామమందు నలరు,
ఆదినారాయణ ప్రభుండౌ మహాత్ము
సాయిబాబునకెప్పుడు నంజలి ఘటింతు. 7

సకలభక్తజనాళి రక్షణము సేయ
నమల గోదావరీ తట మందు వెలసి,
సగుణ బ్రహ్మమై పొగడొందు సాయినాథు,
మ్రొక్కువాఁడను, మఱి మఱి మ్రొక్కువాఁడ. 8

ఎవని తలచేత గంగ జయింపఁబడియె,
నెవని పాదంబునందుద్భవించె గంగ;
ఎవని నెలవు గంగాతటభువివరంబో,
యట్టి సాయీశు. వినతినై యాశ్రయింతు. 9

మొదట బ్రహ్మమై, విష్ణువై పిదప, నంత
మందున సదాశివుండునై యలరువాని,
నమలమూర్తి త్రియాత్మకుండైనవాని,
సాయినాథుని, సతతంబు సంస్తుతింతు, 10

ఎవని దివ్యనామంబుచ్చరించు మాత్ర
ప్రాప్తబహుజన్మ సంసారబంధనంబు
లన్నియొకటంబటాపంచలై నశించు,
సకలజీవుల తాయి, నా సాయిఁగొలుతు. 11

## సాయీ నామ మహిమ.

అఖిల తపముల దానక్రియాదికముల,
నేని నామోచ్చరణ సేసి, యెవనిందలంచి
యత్నకార్యసంసిద్ధిని నందుచుందు,
రట్టియచ్యుతు సాయీశు, నభినుతింతు. 12

నాదు జీవనమగు సాయినాథు దివ్య
నామ; మది,-నామరాజ, మానామమొకటె
తారకం బంతకంటె నితరము నాకు
లేదు- గతియొండు జగమున లేదు-లేదు. 13

భవమహాభూమి రుహాబీజ భర్జనంబు,
నఖిల పుణ్యసంపదలకు నార్జనంబు,
ధర్మకింకరులకు నెల్ల తర్జనంబు,
క్షమను, శ్రీ సాయి ! సాయి ! యన్ గర్జనంబు. 14

మహిని 'శ్రీసాయి' యనెడి నామంబుగలదు
పలుక వశములునై 'నాల్క,' 'వాక్కు' గలవు,
కాని, జనసంచయంబు సంకటము లొంది
యధమ గతిఁ గాంచు, నిదియెట్టి వ్యసనకరమొ ! 15

ఎంత దుఃఖంబు ! దుఃఖంబదెంత యౌర !
దుఃఖములనెల్ల నిది కడు దుఃఖతరము;
గవ్వకాశించి, తనచెంతఁ గ్రాలు దివ్య
సాయినామరత్నముఁ ద్రోయుజడుఁడు గలఁడె ? 16

కీర్తనీయ సాయీనామ కీర్తనంబు,
నాల్క గలిగి యే యెడనేన్ బొనర్పఁడేని,
మోక్షసాధన శ్రేణి దాపునకుఁజేరి
'శ్రమ' యనుచు నెక్కనేరని జడుఁడుగాఁడె ! 17

నేఁడొ, లేక రేపొ మరణించుఁ గాక,
భయదరౌరవ నరకమేన్ బడయనుండుఁ
గాక, శ్రీ సాయినాథునొక్కట స్మరింపఁ
జాలు నతఁడు తరించు సంసరణవార్ధి. 18

దురితంబుల్ పరువెత్తు, మోహమునుడిందున్, జిత్రగుప్తుండు వ్రే
ళ్లరుగన్ వ్రాసిన గ్రంథమంతయువృథాయాసంబుగా నెంచు, స
త్వరుఁడై స్వాగతమిచ్చి, బ్రహ్మకడుసంభావించు, సాయీపరే
శ్వర నామస్మరణానురక్తున కలభ్యంబింక నొండుండునే? **19**

వసుధ, ధనకాంక్షచే ధనవంతుఁజేరి
పలుగతుల వేడికొను మూఢు పగిదినేని,
జనుఁడు, సాయిపాదాబ్జముల్ శరణుఁగనిన,
నివియునవియేమి! సాయుజ్యమేనిఁ బడయు. **20**

వేయునునేల ? పాపపరివేదన తొలఁగు సాయిరామ భ
ద్రామిత దివ్యకర్మసుగుణాద్భుతనామ సుకీర్తనంబులన్
దోయఁగరాదె ! పాపనిరతుండు నజామిళుఁడంత్యవేళ, "నా
రాయణ ! రార !" యంచు సుతునాదృతిఁబిల్చి పరంబు
నొందడే ? **21**

సాయినాథ ! సాయీశ ! శ్రీసాయిబాబ !
యనుచు నుదయాస్తమయములఁ దనుస్మరించు
జనుని పార్శ్వంబునందు శ్రీసాయినిలిచి,
యాపదలఁగాచి, శ్రితునకుఁ బ్రాపగును. **22**

సాయినామజపంబు నిచ్చలును జేసి,
సాయి విభుని ధ్యానంబును సలుపఁజాలు
జనుఁడు, ధర్మార్థకామమోక్షములు నాల్గు
జగతిఁబడయఁగఁజాలు నిస్సంశయముగ. **23**

దురభిమానము సిగ్గును దొలఁగఁజేసి
సతము, శ్రీ సాయినామాళి సంస్మరించు
నతఁడు, తన కోటికులజులు ననుసరింపఁ
బొందుఁబర మేశు నవ్యయానంద పదము. 24

వ్యర్థముగఁ గాలమెందుఁ ద్రోయంగఁదగదు;
ఆయువు క్షణ క్షణంబు క్షయంబునొందుఁ,
గాలుఁడొకయించుకేనియుఁ గరుణఁగనఁడు,
సాయినామసంకీర్తనల్ సలుపమేలు. 25

విశ్వసింపఁదగదు నిశ్వాసమును జనుం,
డెపుడు నిలుచు, నేమొ! యెఱుఁగరాదు;
కాన, బాల్యమాదిగాఁగ శ్రీ సాయి సం
కీర్తనంబు సేయ క్షేమ కరము. 26

యముఁడు క్రూరుండు, దయలేశమైనఁ గనఁడు
పొంచి, యెప్పుడో మనుజునిఁ ద్రుంచివైచు;
సాయినాథపద ధ్యాన సక్తచిత్తుఁ
డైన మనుజుఁడు యమపీడలందఁబోఁడు. 27

సాయినాథ భక్తుండెందు జమునివలన
భయము నొకయించుకేనియుఁ బడయఁబోఁడు;
మృత్యువునకు మృత్యువగు సాయీప్రభుండు
భక్తుదఱినిల్చి, మృతివేళఁ బ్రోవసాగు. 28

సాయి విభు గుణాసక్తులై, సాయిపాద
నీరజములెప్పుడేని ధ్యానించువారు,
కాలు నేనియు, వాని కింకరులనేనిc,
గసరు కలనైనc, బాప వర్జనులుగాన. 29

అకట! చింతారతుండవై యహరహంబు
మూఢ! ఖేదమివ్విధమునc బొంద నేల?
సాయినాథుని నామ సంస్మరణమున నె
దుఃఖసంచయ మొక్కటc దొలcగిపోవు. 30

సాయినాథుని దివ్యదర్శనము మాత్ర
పాపభయము వైళమ పటాపంచలగును,
స్పర్శనమున - మంగళములు సకలమొదవు,
నర్చనమునc - బ్రాపించు నవ్యయపదంబు. 31

మనసుచే వాక్కుచేతc గర్మములవలనc
బ్రాప్తమగు మనుజుని పూర్వపాపఫలము
సకలమును నాశమొందు నిస్సంశయముగ,
సాయినాథుని నామ సంస్మరణమాత్ర. 32

సాయిసద్గురువర నామ సంస్మరణము
నఖిల జగములందున మంగళాస్పదంబు;
ఎంతటియఘంబులకును సాయీశ మనన
మతిరహస్య నిష్కృతియని యరయుమెప్పుడు 33

ధ్యానమున నెద్ది కృతయుగమందు, యజ్ఞ
ములను బొనరించి త్రేతను; బూజసలిపి
ద్వాపరమునందు, బడసి, రద్దాని, గలిని,
సాయిసంకీర్తనమున గాంచంగగలరు. 34

సంసరణవార్థి దాటించు సాధనంబు
లైన వ్రత యజ్ఞ వేదాధ్యయనములాది
నౌకలవి, కాలసరణి వినాశమొందు;
సాయినామ పోతంబు శాశ్వతము - దృఢము. 35

క్షితిని గలివేళ గల్మష చిత్తులకును,
కేవలము పాప విత్తోప జీవనులకు,
సద్విధి క్రియాహీనులౌ జనులకెల్ల,
సాయినాథుని నామంబె శరణు, నిజము. 36

అఖిల వేదస్వరూపకుండైన యెవని
నామకీర్తన పాప ప్రణాశకరమొ,
ప్రణతి, సర్వదుఃఖైక నివారణంబొ,
యట్టి శ్రీ సాయినాథు సమాశ్రయింతు. 37

ఎట్టి సద్గతి తపములనేని లేదొ,
దేని యోగసమాధులందేని గనరొ,
యట్టి సద్గతి - సులభసాధ్యంబు కలిని,
సాయినాథుని నామ సంస్మరణముననె. 38

కలియుగము పాపమూలమై చెలఁగుఁగాక,
యుత్తమంబైన గుణమిట నొకటికలదు;
జనుఁడు శ్రీసాయినాథు కీర్తనముమాత్ర
బంధములఁ బాసి యవ్యయ పదముఁ బడయు. 39

కలియుగంబును బోలు యుగంబు మీక
లభ్యమని నమ్ముఁడీ ముముక్షులార! మీకు;
సాయివిభు దివ్యనామ సంస్మరణముననె
పరమపద మవలీలగఁ బడయుఁగలరు. 40

ఉరు కలిపాపనిర్మథన, ముత్తమ మంగళ సన్నిధానముల్,
పరమపదాప్తికై వెడలు పాంథ ముముక్షుల త్రోవబత్తె, ము
ర్వర కవివర్యవాక్కుల విరామపదంబు, బుధైకజీవనం
బిరవగు ధర్మభూమి రుహబీజము, 'సాయి' పదంబువర్ధిలుల్. 41

సాయినామము పాపఁగాఁజాలనంత
పాప మేపాపియేన్ సలుపంగనోపఁ
డనిన - నీపాపములఁగూర్చి వ్యసనమొంద
నేల? సాయినామంబు నీ పాలలేదె ? 42

తస్కరుఁడు, త్రాగుఁబోతు మిత్రఘ్నుఁడరయ,
బ్రహ్మహంతయు గురుసతీరతుఁడు, మఱియు
నంగనా రాజ గో పితృహంతలెల్ల
ఘోరపాపులు, వీరలు - వీరుగాక, 43

సకల పాప రతాత్ములౌ జనులకెల్ల
"సాయి! సాయి!" యను జపమును సలుపుటొకటె
యతిరహస్యమౌ నిష్కృతియై పొసంగు ;
స్వాంత మాపప్రభు వశవర్తి యగునుగాన. 44

అఖిల యజ్ఞ దాన తపో జపాదికములు
పాపసంచయముల బాపనోపు; గాని,
పాపవాసన దూల్చగ వలనుపడవు,
సాయి గురుదేవ పదసమర్చనము దక్క. 45

సాధువులు న్యస్తచిత్తులు శాంతిపరులు
బ్రహ్మనిష్ఠులు లోకపావనులు; వారి
స్పర్శసోకిన మాత్రి పాపంబులడగు,
నఘ హరుండగు హరి వారియందునుంట. 46

సాయి పదగత మానసుండై యెవండ
నన్యభక్తి భావమున నిరంతరంబు
సాయినామ జపబును సలుపుచుండు
వాని చెంతన "సాయిబాబా" వసించు. 47

నిఖిల జగములనెల్లఁ దృణీకరించి,
యన్నిటను నగ్రివర్తియై యావరించి,
సచ్చిదానంద మయమును, స్వచ్ఛమైన,
సాయి సద్గురునామ తేజంబు పొలుచు. 48

కడఁగి పుణ్యశ్రవణకీర్తనుఁడగు దివ్య
సాయివిభుని చరిత్రలఁ జదివి, వినెడి
సజ్జనుల మనంబుల నిల్చి, సాయినాథుఁ
డశుభములడంచి, కాపాడు ననవరతము. 49

కొలుచువారిఁ దీర్థక్షేత్రములునుగాని
మృచ్ఛిలామయ దేవతలేనిఁగాని,
పావనులఁ జేయుననుట లెప్పటికో! - యేమొ!
సాధుసందర్శనముననే సకలముదవు. 50

శ్రేయమును గోరు జనములు సాయినాథ!
నిన్నువంటి మహాత్ము, మౌనీంద్రవంద్య,
సర్వసత్తము భజియింప నగునుగాదె!
స్వార్థపరులు వేల్పులు; - సాధులటులఁగాదు. 51

స్నానసమయమందు సాయినిఁ దలఁపుము,
జపమునఁగ స్మరింపు సాయిదేవు,
ధ్యాననిష్ఠయందుఁ దలఁపుము సాయీశు,
సాయికీర్తనంబు - సతము సలుపు. 52

సాయినాథ! సాయీశ! శ్రీసాయిబాబ!
సాయిదేవ! సాయీప్రభూ! సాయి! యనుచు,
నిచ్చలు స్మరించి కాలంబుఁ బుచ్చుపొంటె
దినములవి వచ్చిపోవుచుఁ దనరుఁగాత! 53

వాయుస్తంభన కష్టమేల? విపినావాస వ్రతంబేల? స
త్కాయంబెల్లఁ గృశింప భోజన పరిత్యాగంబుఁ గావింప నే
లా? యగ్నిప్రతతిఁ దపస్సులకునై వ్యర్థశ్రమంబేల? శ్రీ
'సాయీరాము'నిఁ బ్రేమఁ గొల్చిన సమస్తంబుఁ బ్రసా
దింపఁడే? 54

సాయి గురువర సల్లాప సత్కథామృ
తంబుఁ గ్రోలఁగ లేని దినంబదొకటి,
దుర్దినంబుగ నెంచుటఁ దొడరుఁగాని,
యంబుదచ్ఛన్న - మది - దుర్దినంబు గాదు. 55

తీర్థపాదుఁడౌ శ్రీసాయిదేవు దివ్య
పాదతీర్థ సంసేవన భాగ్యమొదవు
'భవనమే' యిల 'భవన'మై పరగుఁగాని,
యన్యవిధమైన నది 'వన' మగునుసుమ్ము. 56

సాయిపాదుకా తీర్థభస్మములు సాయి
దేవ దివ్యరూపంబులఁ దేజరిల్లు
నదియె యక్లిష్ట భవనమై యలరుఁగాని,
యన్యమేఁ ఘోరకాననం బనఁగఁబడదె? 57

తీర్థపాదుఁడౌ శ్రీసాయిదేవ దివ్య
పాదతీర్థంబు నోచని భవనచయము,
క్రూరసర్ప పరీత వృక్షోత్కరంబు
బహువిధానేక సంపద్వివర్జితంబు. 58

సజ్జనాzసజ్జన విభేద సరణిలేక
సాయిఁగొలువుడి; శ్రీసాయి శరణుగనుడి;
సకల కామితార్థములఁ గాంచఁగఁగలరు
సాయిసద్గురు కృపను నిస్సంశయముగ. 59

ఆశశాంక సూర్యాది గ్రహంబులెల్ల
యరిగి యరిగి వేసారి క్రుమ్మరుచునుండు;
సాయిపాద సమర్పిత స్వాంతులెట్టి
కాలమందేని రాకపోకడలఁ గనరు. 60

కలుషమతులును, శుచిరహితులును గాక,
సాయినామముఁ గీర్తించు జనుల పాప
సంచయము వేగ వారిఁ ద్యజించిపోవు
మృగపతినిఁ గని పరువెత్తు మృగములట్లు. 61

సకల మంగళాస్పదమైన సాయినాథ
పరమపావన నామ మెవ్వానినోటఁ
బలుకఁబడుచుండు నవ్వాని పాపసంచ
యంబులెల్ల వైళంబ భస్మంబులగును. 62

మలినచిత్తులేన్ సాయి సంస్మరణసేయ
వారి పాపపుంజంబులఁ బాపి ప్రోచు
సాయినాథుఁడు; మదినిఁ గాంక్ష గనకున్న
ననలము దహింపకున్నె? తన్నంటు మాత్ర! 63

సాయినామ పంచాస్య గర్జనము వినని
యంత దనుక శరీర వనాంతరమున
పాప మత్తేభములు స్వైరవర్తనముల
సంచరించుచు ఘీంకృతుల్ సలుపుచుండు. 64

నామ చింతామణియ సాయినామ మెందు,
నమల చైతన్యరస విగ్రహంబు సాయి;
పూర్ణము క్తుడు, శుద్ధుడై పొలుచు శ్రితుడు
నామ-నామినులన్ భేద మేమిలేమి. 65

సకలవిధ ఘోర కలి కల్మషములఁబాపు
సాయి గురుదేవ నామ సంస్మరణ గనని
యంత దనుకఁ బొసంగు దేహాత్మ బుద్ధి,
యంత దనుక నిందొనరు భయపరివృత్తి. 66

ఒక్కమా రెందొ యేగతి నున్నఁగాని
'సాయి' యను నక్షరంబుల జంటఁజేర్చి
పలుకు నతనికి వలసిన పరికరంబు
లమరు నచ్యుత స్థాన ప్రయాణమునకు. 67

'సాయి' యని యాదరమున నక్షర యుగంబు
సతతము జపించు జీవి మోక్షంబునొందు;
కల్మషాత్ములౌ జనులకీ కలియుగమున
నింక సాధనోపాయ మేదేని లేదు. 68

సంతతంబు 'సాయీ! సాయి! సాయి!' యనుచు
జపము సలుపుట మేలగు సజ్జనులకు;
అన్యనామ సహస్ర తుల్యమయి పొల్చు
సాయినామంబు,-సకలార్థ దాయకంబు. 69

'మమ' పాపములను మూలను
క్షమ, "సాయీ" ద్వయము, యష్టకష్టప్రణి వా
రము;- "సాయీశశ్శరణం
మమ"-నా,-సకలార్థ సిద్ధ మంత్రము సుమ్మీ. 70

## గురుమహిమ

దైవమందు పరాభక్తిఁ దగవహించి,
దైవమటు గురునందుఁ దద్భావమూను
నామహాత్ముఁ డొక్కనికె లభ్యమగుచుండు
నఖిల వేదాంత విద్యారహస్యమెల్ల. 71

జ్ఞానదీప ప్రభుండును, గనులయెదుట
వరలు భగవానుఁడౌ గురువరునియందు
మనుజభావముఁ గనువాఁడు వినునదెల్ల
దంతి శౌచంబు పగిది వ్యర్థంబు సుమ్మి. 72

వేంకటేశ సాయీశులన్ భేదమించు
కంతమేనియుఁ బొసఁగఁబో, దట్టివారి
యిరువురం దైక్య సరణి స్మరింపఁజాలు
వాఁడు పడయును శాశ్వత బ్రహ్మపదము. 73

స్థిరుడయి భుక్తిముక్తుల విధించి, మనోహర రూపధారుఁడై,
పరమ కృపావిశేషమున భక్తులఁ బ్రోచుచు, నెల్లఁ దానయై
కరగ, మిల, ధర్మసేతువునుగాచి, యధర్మముడుచి, శాంతికిన్
దెరువిడి, కర్మపాశములఁ ద్రెంచు గురూత్తము-సాయిఁ
గొల్చెదన్. 74

మందమతులు నిందించిన మాన్యులెపుడు
గురుపదాంభోరుహంబులఁ గొల్చుచుంద్రు;
భేకచయ మఱచుచున్న భృంగకులము
సేయుచుండదె? మకరంద సేవనంబు. 75

కనుగొన 'గు' శబ్దమే యంధకారమగును
తన్నిరోధకమై 'రు' శబ్దంబు పొలుచు;
అంధకార నిరోధ మహత్వసిద్ధి
పఱగుటన్ జేసి 'గురు' వను పదము వెలయు. 76

## గురుస్తుతి.

నరుఁడుఁగఁదోచుచున్ గపటనాటకమున్ రచియింతు;వీవిటే
ర్పరచిన కార్యమున్ దెలియరాదు గదా ధర నెంతవారికే!
నురు నరకోటి నీకొక ప్రియుండగువాఁడును, భేదబుద్ధిని
న్నరసెడి యప్రియుండయిన యన్యుఁడు గల్గఁడు సాయి
సత్ప్రభూ! 77

నరులందు నెవరికేనియు
నెఱుగంగారాదు నీదు కృతులెందును; ని
న్నెఱుఁగంగ నిచ్ఛగల ధీ
వరులేనియు మిగుల మోహపడుదురు, సాయీ! 78

పరిభవమొందె సాక్షాద్భగవానుఁ డాద్యుఁ
డైన నారాయణుం డిల మానవుఁడుగ;
స్వీయ మాయచే జగము మోహింపఁ జేసి
సాయినాథుడై ధరణిని సంచరించు. 79

అట్టి భగవానుఁడగు సాయి యవనియందు
సంగవర్జితుఁడైనను – సంగియగును;
జ్ఞాన సంలబ్ధిలేమి నీ మానవాళి
లాఁతి మనుజునిఁగాఁగఁ దలంతు రకట! 80

ఎంత భాగ్య విహీనులో యీజనములు
శిర్డియందుఁ జెంగటను వసించుచున్న
నించుకేని సాయీప్రభు నెఱుఁగలేరు,
మీనములు తెప్ప నెఱుఁగఁగాలేని యటుల. 81

సచ్చిదానందమయుఁడవు, సద్గురుఁడవు,
సాయినాథ! నీచెయ్వు లాశ్చర్యకరము;
నీవు–నినుఁ జేరువారలఁ బోలిన మనుజుఁ
డటులఁ జరియింప జగము మోహాంబుఁగనెడి! 82

సాయి గలండంబువులను,
సాయి ధరన్ గలఁడు, కలఁడు సాయి నగాళిన్,
సాయిప్రభుఁ డగ్నిఁ గలఁడీ
సాయీమయమగుచు నెగడు సకల జగంబుల్. 83

ధర్మసారమును నితాంత తేజముఁ గల్గి
యఖిలసృష్టి మూలమగును సాయి;
పత్రములును బుష్ప ఫల సంచయంబులు
శాఖలగును జీవ సముదయంబు. 84

జ్ఞానమయము బ్రహ్మానందమైన పదము
యోగిజనములన్ దుదిఁ జేర్చుచుండుఁ గాన
"సాయి" యను పరబ్రహ్మాభిధేయమైన
నామ-మన్వర్థమగు, సాయినాథ! నీకు. 85

వనధుల్ భూమి తలంబులౌ, పుడమియేన్ వారాశియౌ;
మృత్కణం
బు నగంబౌ, నగమేన్ రజంబగు; తృణంబున్ వజ్రమౌ,-
వజ్రమేన్
దృణమౌ; వహ్ని హిమోపలంబగు, హిమంబే నగ్నియౌ -
నీవు ప
న్పున;- లీలాద్భుత కార్యధుర్య! చెయి మోడ్పుల్ -నీకు,
సాయీప్రభూ! 86

దానము సత్యమున్ దపము త్యాగము మైత్రియు శౌచ
మార్జవ
జ్ఞానము లెల్ల విద్యలును సద్గురు పాద సరోజసేవయున్
జానుగ నీయెడన్ గలవు, సత్యముచే జగముల్ జయింపవే ?
దీనుల నెల్ల దానములఁ దృప్తులఁజేయవె? సాయిసద్గురూ! 87

మతి వ్యసనంబులు లేమియు,
శ్రుతమును శీలంబు శమము సూనృతదనముల్
క్షితి నీయారు గుణంబులు
సతతము వెలిగించుఁ బూరుషర్షభ సాయిన్. 88

గానములఁబొల్చి, శీలమునకున్ గురువై, వ్యసనంబు లేక, జీ
వనిచయ సౌఖ్య దుఃఖములఁ బొల్చెడు వేళల మోదఖేదముల్
గని మది, వైరమెయ్యెడలఁగానక, శోకనిదాఘతాప నా
శనకరుఁడైన సాయివిభుచంద్రుని సంతత మామతించెదన్. 89

బాలకులు బుద్ధి మాలి, నిన్ భంగపఱుప
వారినెల్లరఁ గృప క్షమింపంగఁబోవె ?
అటుల మాల్య ముఖ్యులు నీకు వ్యథలఁ గూర్ప
సైచినాఁడవు, సద్భావ! సాయి దేవ! 90

అగ్ని హోత్రునివలె ననధి గమ్యుండును,
దోయధి తెఱగున దుస్తరుండు,
హర్యక్షమటు విక్రమాన్వితుండును, హిమ
నిలయునిగతి సేవనీయ పదుఁడు,

పృథివికై వడి క్షమోపేతుండు, పితరుల
సరణిని సహాన విస్ఫారితుండు,
సృష్టిపథంబున సామ్యవర్తనుఁడును,
శంకరువడినిఁ బ్రసాద యుతుఁడు,

అఖిలజీవుల కాశ్రియుమైనవాఁడు,
ఆదిమధ్యాంతరహితుఁడు, నవ్యయుండు,
దాస సంసరణాబ్ధి సంతరణ చరణుఁ
డైన హరి, సాయినాథుఁడై యవతరించె. 91

ఈశ్వరేశ్వరుఁడైన సాయీశ్వరుండు
ప్రకృతియందున్నఁ దద్గుణత్రయికిఁ జిక్కఁ,
డనవరతము నాత్మస్థితుఁడై తనర్చు;
బుద్ధిచొప్పున నాశ్రియములను బొలుచు. 92

దాన యజ్ఞంబులును జప తపములెల్ల
గలుగఁజేయును ధర్మార్థ కామములనె;
సాయినాథ పదాంబుజాశ్రియమొకండె
మోక్ష ఫలముఁ బ్రసాదింప దక్షమగుచు. 93

పరమ మైకాంతభక్తి తత్పరతమెచ్చి
భుక్తి ముక్తుల నొసఁగెడి పూరుషుండు
సద్గురూత్తముఁడై పొల్చు సాయినాథుఁ
డెవని కేనియు నానంద మిడఁగలేఁడె ! 94

సాయినాథ! సాయీశ్వరా! సచ్చరిత్ర!
సంశ్రితుల కభయంబు నొసంగు దీవు:
దారుణ భవాంచితాగ్ని సంతప్తులకును
కరుణ, మోక్షసుధావృష్టి గురియుచుందు. 95

విత్త సుత సతీ గేహనిమిత్త భయము
పరిభవ విచార లోభ ప్రవర్తనములు
మోహకల్పితంబులు; వీని దేహిగనఁడు
నిన్ను శరణొంది యభయము గన్న, సాయి! 96

సాయి సంశ్రితు లెందుఁగాంచంగఁ బోరు
దైహికాత్మిక భౌతిక తాపచయము:
సకల దుఃఖచయంబులు సమసిపోవు
సాయి సద్గురు దేవ ప్రసాదగరిమ. 97

"అచ్యుతానంత ! సాయీశ !" యనెడి మంత్ర
వరము జపియింప సమకూర్చుఁ బరమశుభము:
"ఓమ్నమ" శబ్దములఁగూర్చి యొగి జపింపఁ
బడయు నారోగ్యముచు సాయిప్రభుపు కరుణ. 98

ధరణి గ్రహపీడయు, మహోత్పాతపీడ
రోగపీడయు మఱి మహాక్రూరపీడ
ద్వారకామాయిఁ గల ధుని భస్మమడచు,
సాయినాథ! సద్గురు! నమస్కారశతము. 99

## పాదోదకము.

గురు పదాంబుజ తీర్థంబు ( గ్రోలి గ్రోలి,
శిరమునందున సద్భక్తి ( జేర్చి చేర్చి,
సర్వతీర్థావగాహన సత్ఫలంబు (
బడయ ( జాలును మనుజు ( డీ పుడమియందు 100

దోషపంకంబులకు నెల్ల శోషణంబు,
జ్ఞాన తేజస్సులకు దీపనప్రదంబు,
దారుణ భవాంబురాశి సంతారకంబు,
సాదృతిని ( గ్రోలు సాయి పాదోదకంబు 101

మోహ మూలంబులకును నిర్మూలనంబు,
ఘన విరక్తి శాంతుల కాదికారణంబు,
భవ భయంకర కర్మనివారణంబు
సాదృతిని ( గ్రోలు సాయిపాదోదకంబు. 102

గురు పదాబ్జోదకంబును గ్రోలు ( డెపుడు,
గురువరుని భుక్తిశేషము ( గొనుడీ సతము,
గురుని మూర్తి ధ్యానింపుడి నిరతమెదను
గురుని స్తవముల స్మరియింప ( గోరు ( డెందు. 103

గురు నివాసంబు కాశికాపురివరంబు,
గురు పదాబ్జోదకంబు గంగోదకంబు
గురువు తారకబ్రహ్మ, నికుటవము కనుల
యెదుట ( బొడకట్టు కాశి విశ్వేశ్వరుండు. 114

ఒనర గురుపాద కమలాంక మూనుశిరము
గయను వెలుఁగొందు పావనాక్షయవటంబు;
పుణ్యమూలమౌ సద్గురుమూర్తి, నిక్క
మనుల తీర్థ రాజంబౌ ప్రయాగ జగతి. 105

సప్తజలధి పర్యంతము వ్యాప్తమైన
పుణ్య తీర్థావగాహనంబుల ఫలంబు
సద్గురు పదాబ్జ సేవాబ్ధి జలకణంబు
నందు వేయవ వంతు దానగునో కాదో ! 106

నిరతమును సంస్మరింపుమి గురునిమూర్తి,
సతము చేయుము గురునామ జపము భక్తి,
స్థిరమతినిఁ బొనరింపుమి గురుని యాజ్ఞ,
గొలువఁ బోకు మన్యంబును గురునిఁ దక్క 107

గురుని ముఖమందు వెలుగొందు పరమపురుషు
గురుకృపాకటాక్షమున భక్తుండు వడయు;
నిరతమును దలపోయుడి గురుని మూర్తి;
కులట విటు నెల్ల ప్రొద్దును దలఁచు నటుల, 108

ధ్యానమూలము గురుమూర్తి యాశ్రితులకు
నర్చనా మూలమగును గుర్వంఘ్రియుగము;
మంత్రమూలము గురువాక్కు మనుజులకును,
మోక్షమూలము సద్గురు మూర్తికరుణ. 109

సొగసు మేనున్న ( జక్క-నౌ సుదతియున్న
నతుల ధనమున్న వాక్చమత్కృతియు నున్న
మనసు గురుపదాబ్జముల ( దార్కొ-నదయేని
అవియు నివియును నివియు నయ్యవియు నేల ? 110

సకల వేదవేదాంగ శాస్త్రముల ( గళల
నేరిచిన, సాయిదివ్య పాదారవింద
సేవ నోచఁడేని వ్యర్థమై పోవునవియు
విధవ ముఖమున సిందూరబిందు వటుల. 111

## మంగల ఆరాత్రికము

మంగలము, సాయిప్రభునకు మంగలంబు !
మంగలము, సర్వమూర్తికి మంగలంబు !
మంగలము, భక్తవశునకు, మంగలంబు !
మంగలము, శిర్డివాసికి, మంగలంబు ! 112

మంగలంబు, శ్రీ వేంకుశ మాన్యునకును,
మంగలము శ్రియఃపతికి, శుభాంగునకును,
దైవతాలాంఛనునకు, శ్రీ దండహస్త
మండనుండైన సాయికి మంగలంబు ! 113

మంగలము, భగవాన్ సాయి ! మంగలంబు !
మంగలము, పురుషవిక్రమ ! మంగలంబు !
మంగలము, పుండరీకాక్ష ! మంగలంబు !
మంగలాయతన ప్రభూ ! మంగలంబు ! 114

## నైవేద్యము

విహిత శాస్త్రోక్తమైన నైవేద్యములను
నీకు నర్పింప శక్తుండనే ? మహాత్మ !
శక్తిగలిగినఁగొలఁది నొసంగుచుంటి,
సత్కృపను దృప్తిఁగనఁగదే ! సాయినాథ ! 115

శర్కరయు, నారికేలంబు, జలము, పలు వి
ధంబులైన ఫలంబులు తమ్ములమ్ము,
కలుగుకొలఁది నర్పించితిఁ గరుణఁగొను, ప్రి
పూర్ణముగ నెంచి సాయీప్రభూ ! మహాత్మ ! 116

అన్నమును నాలుగువిధంబులైన రుచ్య
శాకపాకముల్ వ్యంజన సహితములుగ
సఫల సఘృతాన్నమును భుజించఁగదె సాయి !
అన్నము ప్రతిష్ఠితంబగు నన్నమునను. 117

## అధ్యాత్మ నైవేద్యము

బ్రహ్మమౌ స్రుక్కు స్రువములు, బ్రహ్మహవిసు,
బ్రహ్మమగ్ని, బ్రహ్మహుతము, బ్రహ్మ మట్టి
బ్రహ్మ కర్మసమాధిచేఁ బడయఁదగిన
ఫలము సైతము బ్రహ్మమై పఱగుచుండు, 118

నేన యన్నంబు; అన్నంబు నేన యగుదు;
ఏన్ భుజింతు నన్నం బన్న మేఁ భుజింతు,
అన్నమును భుజియించెడి యతఁడు నేన;
అన్నభోక్తను భుజియించు నతఁడు నేన. 119

# ఆత్మ నివేదనము

కేవలంబాత్మకంటె నాకేమి యితర
వస్తువును లేదు నీకు నర్పనముసేయ;
దత్తమగు నాత్మఁగొని గురు దత్తరూప !
కేలు కేలునఁ గీలించి యేలు సాయి ! 120

అదియుఁగుటిల, నా స్వాధీనమందు లేదు,
బలియుఁడవు నీవగుట వశపఱచుకొనియు
ప్రేమ పాశంబులఁ దీని బిగియఁగట్టి
నీదు పదములదఱి, సాయి ! నిలుపుకొనవె ! 121

నీకు నాత్మదానము సేయనేర, నైన
మనసుచే వాక్కుచేత నర్పనము నిడితి;
దాన పరిపూర్తిఁ గావింపఁదగిన శక్తి
నాకనుగ్రహింపవె ! సాయినాధ ! దేవ ! 122

వర్ణబ్రహ్మన్నుఁడ, ఁ గర్మమెయ్యదియు లేదు
లేదు నాకెట్టి కర్మఫలోదయంబు;
లేదు గుణమును, దోషంబు లేదు నాకు,
సాయి ! నాకున్న లాభనష్టంబులింక ? 123

చేసినది, చేయుచున్నది, చేయునదియు
నేనొనర్పలేదీ లోకదృష్టిఁజేసి;
తలఁప లోకనాటక సూత్రధారివీవ ;
నీవ చేయుదు;ఫలమును నీదె సాయి ! 124

శత్రుమిత్రు పక్షంబుల సమతమనుట,
సాయిదేవుని సతతంబు శరణుగంట,
సాయిపై దృష్టిఁ బఱుపుట, సాయిఁగనుట,
శాస్త్రనియతి నీనాల్గు దాచంగఁగంటి. 125

ఎఱుఁగనయ్య ! ధర్మంబు, ప్రవృత్తి నెఱుఁగ,
నెఱుఁగనే నధర్మంబు, నివృత్తి నెఱుఁగ;
హృదయపీఠంబునందు వసించు సాయి
యెటుల నియమించు నటు లాచరించువాఁడ. 126

# కర్పూర హారతి

జయము, శిర్డీనివాస ! శ్రీసాయి ! నీకు,
జయము, భక్తమనోనాథ ! సాయి ! నీకు,
జయము, సర్వదేవాత్మక ! సాయి ! నీకు,
జయము, కర్పూరహారతి, సాయి ! నీకు. 127

# ధ్యానము

మాయాతీతుని, నిత్యు, నేకు, విమలుఁ బ్రహ్మణ్యు, ధీ
సాక్షినిఁ
జ్ఞేయుఁ ద్వంద్వవిదూరుఁ గేవలుని, సచ్చిద్రూపు,
శుద్ధాత్ము, నా
మ్నాయాతీత పథప్రవర్తి, విమలానందాను సంధాయకుఁ
సాయీనాథు, సమర్థసద్గురు నినుఁ ధ్యానింతు
నశ్రాంతముఁ. 128

హృదయ కమల మధ్యంబున మెదలువాని,
విమల సిద్ధాస నాసీనుఁడైనవాని,
సచ్చిదానంద వర సహస్రిమిడువాని,
చంద్రికాంతిశోభితు, గురు సాయిఁగొలుతు. 129

చంద్రికాంత శిలాసమ చారుదేహు,
నఖిలముని జనార్చిత చరణాబ్జ యుగళు,
పాండురాంబరధరు, లఘు దండహస్తు,
సచ్చిదానంద సద్గురు సాయిఁగొలుతు. 130

విషయములఁజిక్కి నిద్రించు వివిధ జీవ
తతుల మేల్కొల్పి కరుణ భద్రములఁగూర్చె,
వేయిగతుల సద్గురుఁడు శ్రీసాయి యొకఁడె,
మెరగుకువులోపఁ గలరె యీశ్వరుఁడు తక్క ! 131

అఖిల జగము దైవాధీనమగుచు నలరు,
దైవము నధీనమగును మంత్రింబునకును,
మహిత సాయీ యధీన మా మంత్రమగుట
సాయి గురుదేవు సతతంబు శరణుగందు. 132

సాత్త్విక ప్రధానంబు లసంఖ్యములుగఁ
దాల్చె నవతారములను శ్రీధరుఁడు తొల్లి;
సర్వసమ్మతము సులభసాధ్యమగును
సాయినాథావతార మీ జగతియందు. 133

అనిమిషులును ఋషులు మునులు మహాబల
పూర్ణులైన మనువు పుత్రకులును
సాధుచరితులౌ ప్రజాపతులీ వీరెల్ల
ఆదిదేవ హరి కలాంశ భవులు. 134

అఖిల దివిజులు శౌరి దివ్యాంశభవులు;
సాధుజనుల రక్షింప రాక్షసుల నడంప,
యుగయుగంబున నృహరి యీజగతిఁబుట్టుఁ,
గేవల భగవానుఁడు 'సాయికృష్ణు' ఁ డరయ. 135

శోభితంబు నగుచు సువిభూతిగలదియి
బలము గలిగియున్న వస్తుసమితి
జగతి నెఱుఁగ నగును సాయి తేజోంశ సం
భవములని జనుండు స్వాంతమందు. 136

అడవులందున భయము చొప్పడినచోట,
చెఱుగులందును, గడగండ్లు దొడరు నెడల,
సాయిభగవాను నొకట సంస్మరణ సేయు
నతఁడు నిజముగ నేబాధలందఁబోఁడు. 137

సగుణ నిర్గుణ బ్రహ్మము - సాయివిభుఁడు,
అతఁడె కైవల్య మోక్ష సుఖానుభూతుఁ,
డాతఁడె, ప్రియుండు, సుహృదుండు, నతఁడె విధిక
రుండు, నాత్మకర్తృండు, గురుండతండె. 138

జ్ఞానులగుచు యోగ నైపుణ్య బుద్ధులై
సకలగతుల మేల్పొసంగ, నెల్ల
భావములను గనుడి జీవేశ్వరైక్యంబు;
ఇదియ కోరఁదగిన దెల్లరకును. 139

సాయిదేవునందు సతత మైకాంతిక
భక్తిఁగనుచు నరుఁడు పడయఁదగిన
యనుప మాత్మభాగ్యమగు, దాన - నెల్లెడ
నతని దివ్యరూప మరయఁగలఁడు. 140

కనఁగ వినఁగ నూహకును బాత్రమైన దెం
దెందు నీజగంబునందుఁ గలదొ,
లోన, వెలిని, నదియు, దానయి వ్యాపించి,
సాయివిభుఁడు - శేషశాయి పొలుచు. 141

అరయ భగవంతుఁడును, సమస్తాంతరాత్మ,
సర్వలోకేశ్వరుండగు సాయిదేవు,
నాత్మయటులఁ బ్రేమించు భాగ్యంబుగలిగె,
నింక ఘోరసంసృతి బంధ మొందులేదు. 142

మధురము వదనము వచనము
మధురము చరితంబు నగవు మధురముచూడ్కుల్
మధురము సంస్మరణంబులు
మధురేశుఁడు కృష్ణసాయి, మధురంబెల్లన్. 143

అఖిల భారత సాయి సంఘాధినేత
యైన నరసింహులు సమ్మతోక్తి ననుసరించి
మననము దెనుంగు కృతిని నప్పనమునిడితి
ప్రథమసర్గంబు, గొను సాయి! ప్రభు వరేణ్య! 144

శ్రీ సాయీమననము

ప్రథమ సర్గము - సమాప్తము.

శ్రీ సాయీనాథార్పణమస్తు.



శ్రీ వేంకటేశాయనమః

శ్రీ సాయినాథాయనమః

# శ్రీ సాయీ మననము

## ద్వితీయ సర్గము.

---

## శ్రీ సాయీ మహత్త్వము

శరణు గనుము సమదర్శను
నిరపేక్షుని మాని శాంతు నిర్వైరుని స
ద్గురు సాయీప్రభువును; ద
ద్వర పాద పరాగమునను బావనమగుమున్. 1

నిఖిలలోక శోకహారంబు నీ యశంబు,
అతి ముదముఁ గూర్చు నీదు కథామృతంబు,
స్మిత సుధలు చిలుకు నీముఖ శీతరశ్మి,
మేలొసఁగు సాయిదేవ ! నీ కేలుదమ్మి. 2

పావనంబు భూరి భవభయ హారము, గు
ణాలయంబు కలిమలాపహంబు,
నైన సాయినామ, మార్తులై జనులు స్మ
రించి రేని, మరి జనించఁబోరు. 3

"ఎవరు శ్రద్ధగలిగి యితరదైవంబులఁ
గొలుచుచున్న నన్ను గొలుచువార;
ఎటుల నన్ను గొలుతు రటుల వారినిఁబ్రోతు"
ననిన కృష్ణసాయి మనుచు మమ్ము. 4

సంతత మెవ రేమతి భగ
వంతుని శ్రీసాయినాథు భజియింతురొ, స
ర్వాంతర్యామియు, నాగతి
చింతామణి పగిది నెల్ల శ్రితులన్ బ్రోచున్. 5

సాయికెనయైన దైవమెచ్చటను లేఁడు,
కనము 'బాబా'కు సమమైన గతి మఱొండు;
నిజ పదమునాకు గంగ జనించెఁగాన,
పృథివి జనులకుఁ దోఁచు శ్రీవిష్ణువతఁడు. 6

కన నీశీరిడి భాగ్యమేమొ నరలోకంబాద హాహా! లోక పా
వనులౌ సాధులుచేరి, యందుపనిషత్ప్రామాణ్య గుప్తాంచితా
ర్థనిరూఢిన్ జదువిష్టశిష్టము, పరబ్రహ్మంబు సాయీ యభి
ఖ్యనరాకారమునన్ వెలుంగఁగని నిత్యానందమున్ బొందరే! 7

శీర్డి నికటంబునందు వసించు జనుల
భాగ్యమదియేమొ ! యెంతటి భాగ్య మహాహా!!
సచ్చిదానంద మయమును, శాశ్వతంబు,
పూర్ణమగు బ్రహ్మ మిత్రమై పొలిచెనందు. 8

పరిణయము లేక, సహచరి తరుణిలేక,
వేలు లక్షుల బిడ్డలఁ బెంపనేర్చె;
అరయఁగా సేని లేక, గృహంబు లేక,
మేలికల కేలికయ్యె సాయీప్రభుండు. 9

శీర్డి వాసుఁడయ్యు - శీర్డినుండఁగఁబోఁడు;
దేహమునను నెగడి - దేహిగాఁడు:
కానుకలను గొనియుఁ గాసంతఁ గొనఁబోఁడు
తినఁడు - తినినయట్లు తనరు, సాయి. 10

మధురమగు సాయి! నీదు నామంబు, మధుర
మై తనర్చు నీదగు రూపు, మాన్యచరిత!
నీదు నామ రూపామృతాస్వాద నిపుణు
లగు బుధులు రూపములఁదోసి సుగతిఁగంద్రు. 11

మధువు మధురము, దధియును మధురమగును,
ద్రాక్ష మధురము, ఖండ శర్కర మధురము:
ద్వారకామాయి విభుని గీతామృతంబు,
మధుర వస్తుజాలముకంటె మధురతరము. 12

సురుచిర సాయిప్రేమ రుచిఁజూచినవారికి షడ్రసోరు సం
భరిత చతుర్విధాన్నములపై మది పోవదు: సాయిపాదవా
రిరుహ విలీనభృంగములు హృష్టమతుల్ - "నినుగూడ స్వర్గమౌ
నరకము నిన్ను బాసిన దినంబులు, సాయి!" యటంచు
రెల్లెడన్ 13

క్షితిఁ గాశిలో నరువదివేల యేండ్లు
వాసముండిననే పుణ్యఫలము గలుగు,
నాఫలముఁ బొందనేరుచు నర్ధనిమిష
కాలమేన్ సాయి ప్రేమను గాంచువాఁడు. 14

పెరటఁ గల్పవృక్షంబయి వెలయు సాయి,
ముంగిటను వేల్పు గిడ్డియై పొలుచు సాయి,
ఱుంత వ్రేలు చింతామణి యగును సాయి,
సాయి నామంబు సకలార్థ సాధకంబు. 15

పాపమడఁచు గంగ, తాపము శశివాపు,
దైన్యమెడపుఁ గల్పతరువు, సంత
తంబు పాప తాప దైన్యంబులను బాపు
సాయిగురు కృపా రసార్ద్ర దృష్టి. 16

విత్తమును గాంచనగును కుబేరుఁ గొలిచి,
ముక్తిని మహేశునర్చించి పొందనగును,
భానువేడి యారోగ్యము బడయఁజెల్లు,
సాయి పాదాశ్రయంబున సకలమొదవు. 17

లోకసుఖము చింతామణి,
నాక సుఖం బింద్రుఁడొసఁగు నందు; మునిజనా
నీకమునకు దుర్లభమగు
వైకుంఠమునేనిఁ బ్రీతి పడు గురుఁడొసఁగున్. 18

ధేనువులఁ గోట్లకొలఁదిగ దానమిడిన,
గల్ప పర్యంతము ప్రయాగఁ గాశినున్న,
జన్మములఁ బలు దానముల్ సలుపఁగనిన,
సాయి నామ చింతన సదృశంబుగాదు. 19

భూత హృదయాంతరంబులఁ బొలుచు సాయి,
నిత్య మనురక్తి నరుఁడు ధ్యానించునేని,
దానములవేల ? వివిధ తీర్థంబులేల ?
క్రతువులవియేల ? బహు తపోవ్రతములేల ? 20

## సాయీభక్తికి అధికారి

తొలి వేలకొలందిగ జ
న్మలఁ దపముల ధ్యానముల సమాధుల వలనన్
గలుషములఁ బాయు సత్పు
ణ్యులకే శ్రీసాయిభక్తి యొనరఁగఁ గలుగున్. 21

తపముల వ్రత దానంబుల
జపసంయమ హోమములను స్వాధ్యాయములన్
సుపథ ప్రవర్తనంబుల
ప్రపంచమున సాయికృష్ణ భక్తి యలవడున్. 22

శ్రద్ధ ధానులై సేవనాశక్తి దనరి,
పుణ్య తీర్థావగాహనంబులను బఱపి,
సాధువులఁ గొల్చి నేర్చిన సజ్జనులకె
యలవడును సాయినాథ కథాభిలాష. 23

సాయి కరుణ నొసఁగె సంసార విష వృక్ష
మమృత తుల్యమౌ ఫలముల రెంటి;
సాయినాథునం దచంచల భక్తియు,
సాధుభక్త పాద సంగమంబు. 24

పేదకే లభ్యమగు దీవుగాదె సాయి!
తగరు నీదు నామమునేనిఁ దలఁచుటకును
జన్మ కర్మఫలైశ్వర్య సంపదాభి
మాన పాండిత్యములఁ దూఁగు మనుజులెందు. 25

# శ్రీ సాయీ మంత్రము

క్షమపై, మానవజన్మ కర్మఫలమున్ సాధింపఁగాఁజాలు మం
త్రము, నీజన్మజరారుజ వ్యథలఁబారన్ద్రోలు మంత్రంబు, వే
దములన్ బేర్వడు మంత్రముల్, వివిధశాస్త్ర ప్రోక్తమౌ
మంత్ర, సా
ర్యమహామంత్రము, "సాయి" "సాయి" యను దివ్య
ద్వ్యక్షరీ మంత్రమౌ. 26

అఖిల వేదాంత వాక్య ప్రతిపాద్యమై
మన్ననల్ చిరమును గన్న మంత్ర,
మంతర్బహి శ్శత్రులందఱ నలయించి
గెలుపును జేకూర్పఁగలుగు మంత్ర,

మరయ భవాంభోధి తరణమౌ మంత్రంబు,
మోహ నిర్మూలన మూలమంత్రి,
మురు ధనైశ్వర్యంబు లొడగూర్చు మంత్రంబు,
వ్యసనంబులన్నిటిఁ బాపు మంత్రి,

మమల ధర్మార్థ కామమోక్షము లొసంగి,
జన్మసాఫల్యమును గూర్పఁజాలు మంత్రి,
మైన, శ్రీసాయి మంత్రి, మీ వనవరతము
జపము సలుపుము - రసనంబ! జపముసలుపు. 27

## శ్రీ సాయినామము — ఔషధము

ముని మనోగతుల దీపనమిదు నౌషధం,
బజ్ఞానమును బాపు నౌషధంబు,
చందోర్కరాది శిష్య ప్రకాండంబుల
హస్తగతంబైన యౌషధంబు,
సకల జగంబుల సంజీవ నౌషధం
బఖిల బాధలఁ బాపు నౌషధంబు,
భక్త హితంకర పరమ సిద్ధౌషధం
బతి భవ భయహార ణౌషధంబు,

ఆశ్రిత జనావనంబగు నౌషధంబు,
అన్ని శ్రేయంబు లొడఁగూర్చు నౌషధంబు,
వెఱ్ఱి మనమ! యాదృతిని సేవింపఁగదవె!
యనవరతము "శ్రీసాయి దివ్యౌషధంబు". 28

సంఘులన్నియు సడలి నాశమగు నెందొ,
యేలిముసమొ యీ నిల్కడలేని తనువు;
సుమతి ! మందులవేల ? రోగములఁ బాపు
ఔషధముఁగొమ్ము – "సాయి రసాయనమ్ము". 29

అచ్చెరువుగాదె! యీమనుష్య ప్రపంచ
మమృత మావలఁద్రోసి విషమును గొనెడి;
'సాయి' 'రామ' 'కృష్ణా'ది ప్రశస్తనామ
ములను గాదని నీచవాక్కులఁ బఠించు. 30

## శ్రీ సాయీ నామ జప విశేషము

నాల్క! రససార మెఱుఁగు కాణాచివీవు,
మధుర రసవస్తువులకుఁ బ్రేమపడు దెపుడు;
సాయి నామామృతంబు నమేయభక్తి
రసనమా! క్రోలుమీవు నిరంతరంబు. 31

"శ్రీమురారి! నారాయణ! కృష్ణ! వరద!
సాయినాథ! భక్తప్రియ! శౌరి! రామ!
హరి! ముకుంద! గోవింద!" యంచనెడు నదియె
రసన! యమృతమా, గ్రోలు నిరంతరంబు. 32

"శ్రీనివాస! విశ్వేశ్వర! మునివంద్య!
సాయిదేవ! సంశ్రితపక్ష! సారసాక్ష!
భక్తరక్షణోపాయ!" యంచానునదియె
నాల్క! యమృతమా, గ్రోలుమనారతంబు. 33

"విశ్వవందిత! నరసింహ! వేంకటేశ!
శంఖచక్ర గదాపాణి! జలజనాభ!
శ్రీధర! యనంత! సాయీశ! మాధవ!" యను
నిదియె యమృతమౌఁ గొలుమీ వెవుడు నాల్క! 34

సాయిరామ! సాయీశ్వర! సాయికృష్ణ!
సాయి మారుతి! విఠ్ఠలసాయి! యనుచుఁ
బలుకఁ గలిగియు నొక్కరుఁ బలుక రెందు
నకట! జనములు దుర్వ్యసనాళిఁ జిక్కి. 35

హరిరూపుఁడైన హరునకు
హరరూపుండైన హరికి నంజలి నిడుదున్;
హర హృదయము హరి, హరుఁడే
హరి హృదయము; హరిహరుండవగుదువు సాయీ! 36

హరిహరులు నొక్కరూపగు
నిరుపురలో భేదమించుకేనియు గను దు
ర్నరుఁడా చంద్రార్కము దు
ర్భర రౌరవ నరక మందు వ్యసనములొందున్. 37

అనురాగంబును శ్రద్ధయుఁ
బెనఁగొన నేమూర్తినైన విశ్వేశ్వరుఁగా
మనమున భయ గౌరవములఁ
గని, సేవల సలుపు మెల్లకాలము కుమతీ! 38

'అమరారి పురారులు ననఁగఁబఱగు
హరిహరుల భేద మిసుమంతయైన లేద'
టంచుఁ దెలిపిన సాయీశుఁ డనవరతము
ప్రేమ మన బుద్ధులెల్లఁ బ్రేరేచుగాత! 39

ఎల్ల జగదీశుఁడైన మహేశునందు
వెలయు జగదంతరాత్ముఁడౌ విష్ణునందు
వస్తుతత్త్వభేద ప్రతిపత్తి లేద;
కాని, సాయి శంకరుఁడు నాల్కకు రుచించు. 40

వెలుపల లోపలఁ బెనఁగుచుఁ
గలకాలము భక్తజనులఁ గాఱించెడి శ
త్రులగు నహంతాదికములఁ
బొలియించును సాయివిభుఁడు మోక్షప్రదుఁడై 41

## శ్రీ సాయీ భక్తులు

సాయివిభుని హృదయ సారసంబున నిల్పు
మహిత సుకృతులైన మానవులకు
లేదు క్రోధగుణము, లేదు మాత్సర్యంబు,
లేదు లోభబుద్ధి, లేదు కుమతి. 42

సాయి నెదను నిల్పి! సాయీశు మ్రొక్కుచు,
సాయివిభుని సేవ సలుపు భక్తుఁ
డైన వానికమరు నీనాల్గు - నాయువు,
ప్రజ్ఞయును - యశంబు - బలము - నెప్పుడు. 43

సాయివిభు సద్గుణంబులు సాయిలీల
లనవరతమును శ్రద్ధతో నాలకించు
శ్రితుని హృదయంబునందు వసించిపోవు
సాయిభగవానుఁ డెక్కడు జాగులేక. 44

సాయివిభుఁడు స్వకీయులౌ జనుల కర్ణ
బిళపథంబున హృదయాబ్జములను జొచ్చి
కల్మషంబంతయును నడుగంటఁజేయు,
జలములను శరత్కాలము సలుపునటుల. 45

అవని, విగత కల్మషచిత్తుఁడైనవాడు
సాయి పాదాశ్రయం బెడఁబాయఁబోఁడు;
ఎక్కుడైన మార్గాయాసమెల్లఁ బాసి
స్వనిలయముఁ జేరి సుఖయించు పథికునటుల. 46

అరయన్ సాయిపదాబ్జ భక్తికలిత స్వాంతుండె ధన్యుండు, వాఁ
డరకాసేనియు లేనివాఁడయినఁ దానౌఁగాక; లోకంబులం
దరుదౌ భక్తుని ప్రేమపాశములచే నాకర్షితుండై విభుం
డరమన్ గాదని విష్ణువే నతని హృన్మధ్యంబునన్
బొల్చెడున్. 47

ఎవని హృదయంబునందు సాయీపదేశుఁ
డెల్లకాలంబులందు వసించుచుండు;
నతఁడు, భక్తిబలమున మోహాంబు నెల్ల
నణచుఁ దమసంబు భాస్కరుండడచునటుల. 48

తెలియ' భగవంతుఁడౌ సాయి దేవునందు
నానదు వాంతరంగిక భక్తియోగమెల్ల
వేగముగ విరక్తిని బ్రభవింపఁజేయు,
దాన. బ్రహ్మ సందర్శన జ్ఞానమొదవు. 49

''సాయినాథ చరణ సన్నిధిఁ జేరుదు
నెల్లకాల మచటనే వసింతు''
ననుచు నెవఁడు దలఁచు నాతఁడు సాయి సా
యుజ్య దివ్యపదము నొందుచుండు. 50

మనసుచే వాక్కుచేత కర్మములవలన
ప్రాప్తమగు మనుజుని పూర్వ పాపఫలము
సకలమును నాశమొందు నిస్సంశయముగ
సాయినాథుని నామ సంస్మరణముననె. 51

నిను జింతించినవారి పాపచయమున్ నిర్మూలమున్ జేతు, స
జ్జనులై నిన్ గొలువన్ శుభప్రద మనస్సంకల్పముల్
గూర్తు, భీ
తిని. దుఃఖమ్ములను, లేమిఁ బాపుచు, దయార్ద్ర భూత
చిత్తుండవై
ఇం కోటిన్ గను నీకుసాటిగలదే? సాయీ! ప్రపన్నావనా! 52

మనసుచే వాక్కు-చేత కర్మములనెందు
సాయినాథుని నామ సంస్మరణ పఱగు
నటఁ, బవిత్ర కురుక్షేత్ర మలరుచుండుఁ,
దనరును బ్రయాగ నైమిశవనములచట. 53

జాహ్నవీ యమునా సరస్వతులు, వేణి
కృష్ణయును సింధు గోదావరియును మఱియు,
వివిధ తీర్థ సంచయములు వెలయుచుండు
సాయినాథుని సత్కథల్ జరుగునెడల. 54

సాయినాథునిఁ జింతింపఁజాలకున్న
గడియయేఁగాని తుదకొక క్షణముకాని
యదియు వ్యర్థంబు, నజ్ఞానమదియు, మౌఢ్య
మదియు, పాపంబు, ఁ దీరని హాని, యదియు. 55

సాయి పాదాబ్జచింతనఁ బాయకున్న
వాని కశుభంబు లడఁగు శుభంబులొదవు;
అమరు సత్త్వశుద్ధియుఁ బరమాత్మ భక్తి,
జ్ఞాన విజ్ఞానములు విరాగంబుఁ గలుగు. 56

సకల కాలములను సాయీశు స్మరియించు
నతని పాప సంచయంబడంచి,
మరణకాలమున విమానమునఁగొని సా
యుజ్య మొసఁగి సాయి యేలుచుండు. 57

ఏయెడ నేగతినుండిన
'సాయీ'! 'సాయీ'. యటంచు స్మరియించునరున్
బాయును బాపచయం, బన
పాయ వికుంఠంబతండు ప్రాపించుఁ దుదిన్. 58

## బాబా - అభయప్రదానము

జీవితము నేనిఁ దుదకుఁ ద్యజింతుగాని
యాశ్రయించిన నాభక్తునవలఁ ద్రోయ;
ప్రాణికోటి నభయ ప్రదాన మొసఁగి,
రక్షణంబుఁ గూర్పక నే నుపేక్ష సేయ. 59

నేనిచట నుండ భయమె
ద్దానను మీకొనగు ? మున్ను దబ్బర పలుకుల్
నేనాడి యెఱుఁగ, నీకముం
దైన నొకప్పుడును గల్లలాడను, సుమ్మా ! 60

'నేను నీవాఁడ' నని యెవ్వఁడేనియున్ బ్ర
పన్నుఁడై యెట్టివాఁడు నేన్ బలికెనేని,
నఖిల భూతంబులకు నైశమభయ మిత్తు
తలఁపుమిది సత్య; మిదియే వ్రతంబునాకు. 61

ప్రతిన నొనర్చి వచింపుమి
క్షితిపయి నాభక్తుఁ డెప్పుడుఁ జెడఁ డంచును, దీ
క్షిత ! నేమాటిచ్చియు నా
శ్రితునకు నెందేని నెగ్గు సేయను సుమ్మా ! 62

ఏను దేహముఁగాను నే మృతినిఁగనను;
అఖిలమును నేన యగుదు నన్నరయు, మెపుడు;
నాదు భక్తుఁ డే యెడ నెప్డు నన్నుఁ దలఁచు
నటకు నప్పుడే తెంచి నే నతనిఁ గాతు. 63

దారువు పాషాణంబుల
తీరునఁ గూలంగఁబడి మృతిన్గను మత్సే
వారతుని మరువకేఁ బెం
పారంగను బరమపదము నందఁగఁ జేతున్. 64

తనయు కరణి, నన్నుఁ దండ్రిఁగా భావించి,
యాశ్రయించెనేని నతని విడువ;
నతని సంకటముల హరియించి సంరక్ష
ణంబు నిడుదు నిదె వ్రతంబు నాకు. 65

నను గొలుచువాని గేహం
బునఁ గుడువఁగఁగట్టఁ గొఱతపొసఁగ దెప్పుడు; నా
తని నతని కుటుంబంబును
బనివడి నే వేయికండ్లఁ బరి రక్షింతున్. 66

సకల ధర్మములను జక్కఁగఁ ద్యజియించి
నన్నె శరణుగనుమి, నిన్ను నేను
సకల గతుల పాప సంచయంబులనుండి
విడఁగఁ జేతు, దుఃఖపడకుమింక. 67

మరణించువేళ విషయ
స్మరణంబును మాని నన్నె స్మరియించి, కళే
బరమును విడచెడి సుజనుఁడు
పరమపదంబౌ వికుంఠ పదమును బొందున్. 68

కాన, నీవు సర్వకాలంబులం దేమి
సలుపుచున్న నాదుస్మరణఁ గనుమి;
పొసఁగ నీదుమనసు బుద్ధి నాకొసఁగి, న
న్నొందఁగలవు; లేదు, సందియంబు. 69

పఱపు నాయందు తలఁపు; నాభక్తి నెఱపు,
నన్నె యజియింపు, నాకు వందనము సలుపు,
పరమగమ్యమేననుచు నీ వెఱుఁగు, మిట్టి
యాత్మయోగముచే నన్నె యందఁగలవు. 70

నిన్ను నీపరివారము నీదు హితుల
నెల్లగతుల సంరక్షింతు నేన సతము;
అన్ని వేళలయందు నిన్నంటియున్న
నన్ను వీక్షింపఁ గలవీ వనన్యభక్తి. 71

అనయంబును నీ భువనం
బును, నాత్మేతరమునైన భువనచయంబున్,
దన పరిజనులను, బంధుల
ధనముల గేహములఁ బశు వితానములెల్లన్. 72

మఱియు నిరతంబు సర్వముఁ
బరివర్జించుచు, ననన్యభక్తిని విశ్వం
భరుఁడైన నన్నె కొలిచెడి
వరమతులను మృతినిఁ బాపి పరిరక్షింతున్ 73

## బాబా బోధ

అతులిత భక్తిగౌరవ సమగ్రతఁ జూపుము నన్ను మీఁదే
గతి నతిప్రీతిఁ గాంతు, రటుఁ గల్గు చరాచర భూతకోటికిన్
బ్రతిపదమందుఁ జూడఁ బడుఁ బామర దృష్టిని వీడి, భక్తమందా
ర! తెలియుఁడీసుదృష్టి. సుకరంబుగ నన్ను భజించు
తెన్నికన్. 74

ప్రాణి హృదయంబులన్ బొల్చి యాత్మయనఁగఁ
బరగు నీశ్వరుండైన శ్రీహరిని నేన;
అఖిల భూతజాలంబు నాయందుఁ గనుడి,
దాన, నేనెంతయేని సంతసముఁగాందు. 75

“సకల భూతములను సాయినాథుఁడు భగ
వానుఁ డీశ్వరుండు పఱగు”-ననుచు
నెఱిఁగి ప్రాణి వితతి హృదయేప్సితార్థంబు
లొసఁగి గౌరవింపఁ బొసఁగు మేలు. 76

దేహమని పల్కఁబడునది దేవళము, స
నాతనుఁడగు జీవుఁడె శివుఁడై తనర్చు;
అందు నజ్ఞాన నైర్మల్యమవలఁ ద్రోసి
పూజసలుపు 'సోఽహం' భావముననుసతము. 77

వెగటురూపుగాని సొగసురూపేన్, బురు
షుండుగాని లేక సుదతిగాని;
ఖగముగాని మృగముగాని తోచునది చై
తన్య వస్తువనుచుఁ దలఁపుమీవు. 78

బాహ్యదృష్టిచే మోహంబు పరిభవమొందు.
లోన వెలుఁగొందు సత్యంబుఁ గాననగును;
కనులఁ దేటిపాఱఁగ విప్పి కాంచుదేని
ఈశ్వరమయంబుఁగాఁ దోఁచు నీజగంబు. 79

అందమైనవస్తువు నెందు నాయుదేని.
"హృదయ రంజకమై తోఁచు నిట్టి దీని
రచనచేసివాఁ డెంత రసిక వరుఁడో!"
యంచు నిది మదిలో విచారించికొనుము. 80

ప్రతిజీవంబునఁ జేరి, చాటుపడి, సర్వవ్యాపియై, యీశుఁడై
యతులప్రాణి చయాంతరాత్మయయి, కర్మాధ్యక్షుఁడై, లోక సం
స్థితి భూతాధి నివాసుఁడై, హృదయ సాక్షీభూతుఁడై, నిర్గుణాం
చితుఁడై, కేవలుఁడైన, దేవుఁడొకఁడౌ, శ్రీసాయి వర్ధిల్లెడిన్. 81

భూతములకెల్లఁ దగునట్లు ప్రీతిఁబఱపి
విభజనము సేసి యన్నంబుఁ బెట్టనగును;
ప్రాణికోటి సేయిష్టదైవముగఁ గనుము,
ముఖ్యముగ నమోఽందిట్టి బుద్ధి వలయు. 82

భూత తతి హేతువయ్యు, (దా భూతకోటిఁ
జొఱక యే చొఱఁబడినట్లు సఱగువాని;
నగ్ని యందున గురునందు నాత్మయందు
సకలజీవంబులందు నీశ్వరుని, గనుము! 83

తనను, భగవంతు, నఖిల భూతంబులందుఁ;
బ్రాణి సంచయమును భగవానునందుఁ,
జూడనేర్చిన యామనుజుండె జగము
లందు భాగవతోత్తముం డనఁగఁ బఱఁగు. 84

అఖిల భూతంబులం దంతరాత్మ నగుచు
భూతముల వసించిన నన్ను బుద్ధి నెఱిఁగి,
చెలిమిఁ బ్రేమల నెఱపి, వీక్షించి, గౌర
వించి, కోర్కెలర్పించి, యజించనగును. 85

ప్రాణి హృద్గుహాన్ డాగిన పరుని నెఱుఁగు
ప్రాజ్ఞమతమిది:- బుధులెదుర్పడెడు నెడల
ముందుఁ జని సాగిలంబడి మ్రొక్కుచుండ్రి;-
దేహమతికి వర్తించదితెన్ను - సుహృద! 86

ప్రాణులకు మ్రొక్కులిడి స
న్మానింపుము, సర్వగతుల మానసమున, సా
యీనాథుఁడు భగవానుఁడు
ప్రాణుల యాత్మ స్వరూపుఁడని యెడి బుద్ధిన్. 87

నేను నీవ; భిన్నుఁడవెందు నీవు కావు;
నీవ నేనౌదుఁ - గనుమిది - దేవదేవ!
ఇట్టి మన యిర్వురను రనంతేనిఁగాని
భేదమును గననేరరు వేదవిదులు. 88

పఱగ నితరుల కంటె పాపలనుగాని,
యద్ధమందైనఁగాని, తన్నరసి నరుఁడు
ద్వివిధ రూపంబులుఁగ ( దన్నుఁ దెలిసికొనెనేని,
నదియ నీకును నాకగు నంతరంబు. 89

అరయ వసుదేవ శబ్దితంబౌ విశుద్ధ
సత్త్వమునఁ బరాత్పరుఁడు గోచరమునొందు,
దాన మనసుచేఁ గాంతు సత్త్వంబు నంద,
పరుని భగవంతుండైన శ్రీ వాసుదేవు. 90

జయము, సాయి! జగన్నాథ! జయము జయము!
జయము, పాపవినాశన! జయము జయము!
జయము, సాధుజనావన! జయము జయము!
జయము, సర్వఫలప్రద! జయము జయము! 91

సాయినాథునకును సాటియౌ రక్షకుఁ
గనఁగ లేదు మున్ను వినఁగ లేదు;
మఱియు సాయివిభుఁడు మాంసమేదోఽస్థి సం
భూతుఁడైన మనుజమూర్తిగాఁడు. 92

# శ్రీ సాయీ కృపా విశేషము

ఆశ్రయించువారి యందున నెవరైనను
సాయినాథు భక్తి శరణుఁ గనెడి
సజ్జనులకు మోక్ష సామ్రాజ్య మఱచేత
నమరఁ, బెర విభూతులనఁగ నెంత ? 93

"బూటి గోపాలరావు"ను బ్రోచె నెవఁడు ?
ఉరగ దష్టుఁడౌ 'మిరకరు' నోమె నెవఁడు ?
భక్తబృందంబులకు నెల్లఁ బ్రాపెవండు ?
అట్టి సాయి, నేఁడును గలఁ, డరుగఁడెందు. 94

అడలి సంసృతాంబుధి నెట్లు గడతుననుచు,
పరమపదలబ్ధి యేగతిఁ బడయుదనుచు,
వ్యాకులత నొందలనమేని నీకుఁ దగదు;
సకల శుభముల నిడు నీకు, సాయివిభుఁడు. 95

శరణన్నమాత్ర వాత్సల్యంబుఁ బఱపును,
తలఁచిన నభయ ప్రదాన మొసఁగు,
నార్తుఁడననియన్న నార్తి హరించును,
'తన'-'పెర'-యనక యౌదార్యమూను,
పాపంబులఁ దలంచి కోపంబుఁగనక య
ఘంబుల నిర్మూలనంబు సేయు,
బ్రహ్మాదులకునేనిఁ బడయ దుర్లభమగు
శ్రేయపదంబు సంసిద్ధి గూర్చు,

సాయి హరి:- కాన, నాశ్రయణీయుఁడతఁడె;
కలరు 'చందోర్కరు'ను 'మిరికరు'ను 'నాచ్నె'
'నార్కె' సర్పము 'నూల్కర్'ల నంగ సాక్షు
లాఱుగురు, నిందుఁగలుగు సత్యంబుఁదెలుప. 96

జయమగును నీకు, విజయము
జయమిదె సిత జలజనేత్ర! సజ్జనమిత్ర!
జయమిదియె విశ్వమంగళ!
జయమిదియే సాయి! సాధు సన్నుతలీలా! 97

సాయినాథుండు నాప్రియ జననిసుమ్ము!
సాయిసద్గురుఁడే నాదు జనకుఁడగును;
సాయి పదభక్తిరతులె నాస్వజనచయము,
సాయి విలసిత భువనముల్ స్వీయ గృహము. 98

సత్యవచుఁడవు, హితుఁడవు, సాధు బంధు
వైన నినువీడి మనుజుఁడే యన్యుఁజేరు?
సకలమున్ నిన్నుఁగూడ నొసఁగవె? నీకుఁ
వఱుగుఁ బెఱుగులున్నవె? సాయి! గురువరేణ్య! 99

వారిజంబుల నలరించు భాస్కరుండు,
కలువలకు మోదమిడుఁ దారకావిభుండు,
కోరకయె నీరు వర్షించు వారిధరుఁడు
సహజము పరహితకృతి సల్పు సాధుజనుఁడు. 100

మహనీయ గుణగణాఢ్యులై
మహాదగ్ధముఁ గూర్పగాఁ సమర్థులుసుమీ!
మహి, నెవరోర్తురు బాడబ
దహనుని భరియింప జలధి తక్కఁగ? సాయీ! 101

పరమపురుషు సాయి చరణముల్ సేరియు
నితర వేల్పులను భజింపనేల?
జాహ్నవీతటంబుఁ జక్కఁ జేరి బుధుండు
నీరములకు బావి నెమకునేమి? 102

# శ్రీ సాయీప్రభువే శరణ్యుఁడు

ఘోర భయమునుండి గాచి వెలిగాలిన మేటి
యన్యుఁ డెవఁడు లేఁడటంచు నెఱిఁగి,
యాశ్రయంబుకొఱకు నాతుర పడువాఁడు
సాయిప్రభువునొకని శరణుగనును. 103

వ్యసనమడఁచి శ్రీయొసఁగఁ గంజాక్షుఁడౌ
సాయికంటె వేఱు శరణ మెఱుఁగ;
ధర్మమెఱిఁగి, యితర తలఁపులుడిగి, హృదిన్
సాయినిలిపి భజన సలుపుమీవు. 104

ఆర్తులును, వికలులు, శిథిలాత్ము లమిత
భీతులును, మహావ్యాధి సంపీడితులును,
సాయినాథుని నామ సంస్మరణమాత్ర
వ్యసనములఁబాసి సౌఖ్యముల్ పడయుచుంద్రు. 105

ఆర్తులైన జనుల యార్తిని హరియించి
భీరులైనవారి భీతిఁబాపి,
కల్మషులగు రిపుల కాలదండంబైన,
సాయివిభున కెపుడుఁ జేయిమోడ్తు. 106

వారిజ సంకాశుని, కు
ష్ఠీరమణీ యాంబరుని, విమలు, శ్రిత మం
దారదుమము, నచ్యుతు, సా
యీరాముచేఁ గొలువవారలెఱుఁగరు
భయముల్. 107

అతఁడె పాపవిభుండు భయమందనివాఁడు శ్రితాళి
కెల్లఁజే
యూఁత నొసంగువాఁడు భయమొందఁగ నీయని
వాఁడు నయ్యెనే
నాతఁడొకండె; పెక్కు—రయినంతఁ బరస్పర భీతిగాదె!
యా
త్మేతరమెట్టిదేని నతఁడొంచఁకు మిన్నగ సాయి
సత్ప్రభూ! 108

సాయికృష్ణ! నీవు సత్కృపాళుఁడవు,
దిక్కులేని వారిదిక్కునీవ,
వ్యసనములను దోగు వారికెల్లరకును
ప్రాపునీవ కావె? పరమపురుష! 109

స్వల్పబుద్ధులైన వారలెంచుచునుంద్రు
స్వజనమనియు, మఱియుఁ బరజనమని;
సాధులా నుదార చరితులీయఖిల జ
గంబు నెంత్రు తమ కుటుంబమనుచు. 110

ఉపకృతిని సల్పువాని యందొనర సాధు
తనము జూపెడి యాతని గుణమదేమి ?
అపకృతిని సల్పునాతనియందుఁబఱపు
సాధు సాధుభావమె బుధసమ్మతంబు. 111

అన్యకష్టంబుచే గష్టమందుచుండ్రు
జగతి సాధారణంబుగ సాధుజనము;
అదియుపో సర్వ భూతాంత రాత్మ మైన
మాధవాంఘ్రి సరోరుహా రాధనంబు. 112

భక్త సులభుఁడగుచు భగవానుఁడౌ సాయి
వెంటనుండు నెల్లవేళలందు;
భక్తజనులకెప్పుడుఁ బరిచర్యలొనరించు
నతఁడు ప్రీతినొంద నఖిలమొదవు 113

సాయినాథుపాద సంసేవనమె ముండ్లు
నెగు[illegible] దిగుడులేక నెగడుబాట;
కనులురెండుమూసికొనుచుఁ బర్వెత్తిన
జనుడుకూలఁ బోఁడు-జాఱిపడఁడు. 114

సాయినాథ పరాయణుల్ సచ్చరితు
లైన సాధుపులరిగిన యట్టిబాట
భయముఁదోఁపఁగనీక శుభంబు లొసఁగు;
జగతి యందెల్లనిదె ప్రశస్తంబు సుమ్మి. 115

## న మ స్కృ తి

ఎల్లవనితలఁ దల్లులంచెంచువాని,
నఖిల జనముల బంధులంచరయువానిఁ,
గాంచనము మంటి సమముగఁగాంచువాని,
సాయినాథునిఁగొలుతు నంజలిఘటించి. 116

ప్రణమతులివియె జగద్గురు !
ప్రణమతులివియే శివా ! శివంకర ! యోగిం
ద్రనికాయ సార్వభౌమా !
ప్రణతులు గురులోక గురువరా ! సాయీశా ! 117

సాయి పదపద్మములకు నంజలి ఘటింతు
సాయినాథున కెపుడు పూజలనుజేతు;
సాయినిర్మల శుభనామ జపమొనర్తు
సాయిదేవ తత్త్వంబునే సంస్మరింతు. 118

శిర్డియందునఁ దనువు త్యజించి మించె,
భక్తజనులకు దీవనల్ పలుపనేర్చె
సచ్చిదానంద రూపుఁడౌ సాయినాథుఁ;
డట్టిగురుదేవు, వేమారులభినుతింతు. 119

ఎవఁడు మృత్యుంజయుండో మహేశ్వరుండు,
సమిత శుభదాయకుండు నారాయణుండు,
నఖిల కర్తయజుఁడు, త్రిమూర్త్యాత్ముఁడెవఁడు,
అట్టిసాయినాథునకు నే నంజలిడుదు. 120

ఆపదలను సతము హరియించువాఁడును,
సకల సంపదల నొసంగు వాఁడు,
విశ్వమోహనుఁడయి వెలయు సాయిప్రభు,
మ్రొక్కవాఁడ మఱియు, మ్రొక్కువాఁడ. 121

గురువే బ్రహ్మయు విష్ణువు,
గురువే విశ్వేశ్వరుండు; గురువే యిల గో
చరమైన పరబ్రహ్మము
గురువు సకలమట్టి సాయిగురువు భజింతున్. 122

గురువనుంగు తండ్రి, గురువు కూరిమితల్లి
గురువు లోకమందుఁ బరమశివుఁడు;
హరుఁడు కుపితుఁడైన గురువు సంరక్షించు
గురుఁడు కోపపడినఁ దిక్కులేదు. 123

ఘనమోహ తిమిరమునఁ జీ
కుని వెలఁగనలేక మిగులఁగుందు శ్రితునిపై
కనికరము పూని, జ్ఞానాం
జనమున, గను తెఱపి గూర్చు సాయినిఁగొలుతున్. 124

అవిరళమగు వృత్త్యాకృతి నమరునీచ
రాచరంబగు విశ్వంబు నావరించి,
స్వీయమౌ దివ్యపదము ఁ జూపింపఁజాలు
గురువు సాయిదేవునకు, మ్రొక్కులు ఘటింతు 125

సతము శ్రుతి శిరోరత్న సంచయములెవని
పాద వారిజంబులకు నివాళు లొసఁగు;
బహువిధోపనిషత్కంజ భానుఁడెవఁడు !
అట్టి సద్గురు సాయికే నంజలిడుదు. 126

ఎవని సంస్మరించిన మాత్రనే తనంత
జ్ఞాన ముదయించుచుండును మానవులకు;
సకల సత్త్వ సంపత్తియే సాధువరుఁడు,
అట్టి సద్గురు సాయీశు నభినతింతు. 127

శాంతమును స్థిరంబుఁ జైతన్యవస్తువై
మోహముడిగి, పాపము క్షమగుచు,
విశ్వమయము, నాదబిందు కళాతీత
మైన గురుని సాయి నభినుతింతు. 128

జ్ఞానశక్తులకును సర్వాధికారియై
తత్త్వమాల నెడఁద దనరుచుండ,
సక్తిఁ జేరుమాత్ర భుక్తిముక్తు లొసంగు
సద్గురుఁడగు సాయి సన్నుతింతు. 129

పలువిధంబులైన భవములనుండి సం
ప్రాప్తములగు కర్మ బంధములను
స్వాత్మరూపమైన జ్ఞానంబుచేఁ బాపు
సద్గురుఁడగు సాయి శరణు గందు. 130

నా మనాథుఁడు-శ్రీ జగన్నాథుఁడగుచు
మద్గురుండును నిఖిల జగద్గురుఁడయి
అస్మదాత్మయు సర్వభూతాత్మయగుచు
వరలు శ్రీసాయివిభునకేఁ బ్రణతులిడుదు. 131

## సమాశ్రయము

ధర సంసార మహాంబుధిన్ బతితులై ద్వంద్వానిలోద్ధూతులై
తరుణీ బంధు సుతాది రక్షణ బృహద్భారంబునన్ డస్సి య
స్థిరమౌ నింద్రియ భోగతోయముల నార్తిన్ మున్గి, యే తారకం
బెఱుఁగన్ నేరని వారికిన్ గలదు "సాయీ పోత్ర" మాధారమై. 132

శంఖ చక్ర గదాఽభయ శస్త్ర హస్త!
మాధవాచ్యుత! ద్వారకామాయి నిలయ!
సారసాయతలోచన! సాయినాథ!
శరణుఁజొచ్చితి నాకు రక్షణము నిడవె! 133

అనుభావ్యం బగు యాతనాభయమదేలా? దుర్మతీ! నీభరం
బును సాయీప్రభుపూన; బాపరిపులేవున్ బాయఁగాఁ బోరె? చ
య్యన లేలెమ్మా, - భజింపు భక్తి సులభుండౌ సాయినిన్; లోకర
క్షణ దీక్షాపరుఁడాత,ఁ డొక్క - శ్రితు - నిన్ - గాపాడ వెన్కాడునే? 134

అన్నవస్త్రాదికములకై వ్యర్థముగను
జనము లక్కట! వ్యసనంబు ననుభవింతు,రి
సకల భువనములను సాకు సాయివిభుఁడు
స్వీయ భక్తజనుల నుపేక్షించునేమి? 135

త్రిజగన్నాథుఁడు, పూరుషోత్తముఁడు హృత్సేవ్యుండు సర్వార్థ దుం
డజుఁడౌ సాయివిభుండు గల్గఁగనకే, స్వల్పార్థమాసించి. యొ
క్కజమున్, స్వీయ పదాభిమాని, దురహంకారున్ బవల్ రేలు, వెం
టఁజరింపన్ దలపోయు మాదృశులు కట్టా! యెట్టి మూఢాత్ములో! 136

తలఁప నరులయందు ధర్మార్థకామార్థు
లైనవారు పశు సమానులందురి;
పఱఁగ ముక్తికోరు ప్రాణియె యుత్తమం
బగుటఁ గుమతి! మోక్షమాశ్రయింపు. 137

ఎచట యోగేశ్వరుండు సాయీశుఁడుండు
నెచట సాయీశ్రితుల్ భక్తులెసఁగుచుందు;
రచట, శ్రీయునుభూతి, జయంబు నీతి
నిలచియుండు నెల్లపుడిది నిజము! నిజము! 138

ఏ యనఘుని స్మరియింప, న
మేయ శుభోత్కరము లొదవు మేదినినా, నా
రాయణ పరావతారున్
సాయీగురుదేవు సతము శరణము సేతున్. 139

అమితంబయ్యెను దైన్యహైన్యములు సేవాసక్తిమై, దైవయో
గమునన్ జొప్పడు పాపతాపములచేఁ గాయంబు వేసారె; లో
భమొనిన్ గ్రిమ్మగ శోక మోహముల క్షోభంబొందె
సీనాదు హృ
దము, కానన్ గృపఁజూచి సాయి! బుధమాన్యా! నన్ను
రక్షింపవే! 140

అంచిత కీటకంబుల మృగాదులఁ బక్షుల, నాగయక్ష రా
త్రించరులన్ మనుష్యులఁ బొరింబొరి యేగతి నెంచ నెంచు జ
న్మించిన, నీదు దివ్య పద నీరజ వందనపాయమైన ని
శ్చంచల భక్తి నీయఁగదె! సత్కరుణామతి! సాయి
మారుతీ! 141

నేనెన్ని వేల కోలఁదుల
యోనుల నెందెందుఁ బుట్టుచుందునో; యందం
దీనాకు నీ పదాబ్జ
ధ్యాన సునిశ్చలతఁ గూర్పు మనిశము, సాయీ! 142

పెఁడలొగ్గి మ్రొక్కెడి రహస్యముగాఁ జెయిఁజాచి వేసనా
పై దయ నాఁటి లేదనక పాలనసేయవె! నాదుకోర్కె; నీ
పాద సరోజముల్ భవభవంబున నేమఱుపాటు లేక య
త్యాదృతిఁ గొల్చు భాగ్యమిదు మయ్యా! పరాత్పర! సాయి
శంకరా! 143

జ్ఞానవిహీనులు విషయే
చ్ఛానిరతినిఁ జెడని ప్రీతిసలుపు విధమునన్
నీనామ స్మరణను నా
మానసమున ప్రీతిఁ గూర్పుమా - సాయివిభూ! 144

మా మానసముల నీకిడినన్
గామించియుఁ బొందఁ బోము కామఫలంబున్
వేమరు వేఁగిన విత్తులు
భూమిని మొలకెత్తఁ జేయఁ బొసఁగునె? సాయీ! 145

తల సాయీపదధూళి ధూసరితమై ధన్యత్వమేపారఁ, గ
న్నులు సాయీప్రభు దివ్యదర్శనమునన్ మోహంబుఁ
బోఁదోలియు, బు
ద్ధి లసత్సాయి పరేశు చింతనము శుద్ధిం గాంచ, నీ జిహ్వ య
క్కలి సాయీస్తుతిచే సుధారసము వర్షింపన్, ప్రశంసా
ర్హముల్. 146

"సరళులు తుల్యదర్శనులు సాయిశ్రితుల్, భగవత్ప్ర
పన్ను; లా
సురలును వారి సత్కథల సొంపుగఁ గీర్తన సేయుచుంద్రు; శ్రీ
హరియు గదాధరుండయి యహర్నిశ లండగ నిల్చు, వారి నె
త్తికి దఱియంగఁ బోకు"డని ధర్ముఁడు పల్కెడి బంట్లతో
ప్రభూ! 147

## నమోవాకములు

ప్రణవ తత్త్వణార్థ విభాసితుఁడవు,
నిర్మల జ్ఞానమూర్తివై నెగడుదీవు;
ప్రథిత శాంతుఁడవును, మూలరహితుఁడవగు
సాయినాథ! నీకిదె నమస్కారశతము. 148

సోముఁడవు పితామహుఁడవు, ఁ బ్రపితామహుండవు,
వాయువు యముండు వరుణుఁడు వహ్నివీవ,
మ్రొక్కువాఁడ. వేమారులు మ్రొక్కువాఁడ,
మ్రొక్కుదును సాయి! మఱిమఱి మ్రొక్కువాఁడ. 149

ముందువెనుకను సర్వత్రి వందనంబు
లాచరింతు ననంత వీర్యంబు, నమిత
విక్రమముఁగల్గి యెల్ల వ్యాపించియుంట
సకలమును నీవ; సద్భావ! సాయిదేవ! 150

బ్రహ్మవును సర్వభూతాధి వాసుఁడవును
శాంతుఁడవు, నధికుఁడవు, విశ్వంభరుఁడవు;
వాసుదేవుఁడవును భగవానుఁడీవ;
సాయినాథ! పల్మరు నీకుఁ జేయిమోడ్తు. 151

ఏవిభు కీర్తనార్చనము లెవ్వని సంస్మరణంబు వందనం
బేవిభురూప వీక్షణము లేని కథాశ్రవణంబుసేయ దో
షావళిఁబాసి లోకము సుఖాంచితవృత్తిఁ జెలంగునందు రే
నావిభు భద్రకీర్తియుతు నచ్యుతు సాయిని వ్రాలి
మ్రొక్కెదన్. 152

గుణవృత్తులఁడఁచు వానిని
ననుపమ ధనయుతుని, శాంతు, నాత్మారాముం
డును కైవల్యాధిపుఁడయి
వినుతిన్ గను సాయివిభుని వేమరుఁగొలుతున్. 153

ఏపుణ్య లేశమో యిది
పాపరతుండైన నీనిపై సత్కరుణన్
జూపితి, నీసేవకుఁడన్
బ్రోపిడవే! భక్తహృదయవాసా! సాయీ! 154

అఖిల భారత సాయి సంఘాధినేత
యైన నరసింహు నమ్రతో క్తి ననుసరించి
తెనుఁగునన్ సాయిమనన ద్వితీయసర్గ
మప్పనము సేసితిని గొనుమయ్య! సాయి! 155

శ్రీ సాయీమననము

ద్వితీయ సర్గము - సమాప్తము.

శ్రీ సాయీనాథార్పణమస్తు.



శ్రీ వేంకటేశాయనమః

శ్రీ సాయినాథాయనమః

# శ్రీ సాయీమననము

## తృతీయ సర్గము.

---

### ప్రణతి

ప్రణతులిడుదు నిర్గుణునకుఁ,
బ్రణామములు గుణాత్మునకును, బహురూపునకున్
బ్రణతులిడు దరూపునకును,
బ్రణతులు వివిధైక చిత్ర పరరూపునకున్. 1

వందనము లోకవిభునకు,
వందనములు సాధుభక్త వాత్సల్యునకున్,
వందనము జ్ఞానమూర్తికి,
వందనములు సాయినాథ భద్రాత్మునకున్. 2

మూఢులకు దూరగతుఁడట్లు పొలుచువాని,
హృదయ పద్మాసనస్థుఁడై పొదలువాని,
నేప్రమాణ మూసింపకే యెసఁగువాని,
జ్ఞాన సాక్షియౌ సాయిని సతముఁ గొలుతు. 3

పరమ కళ్యాణమూర్తికిఁ గరము మోడ్చి,
విశ్వమంగళునకు భక్తి వినతి సేతు,
సత్య ధర్మప్రభువున కంజలి ఘటింతు,
సాయి కృష్ణునకిదె, నమస్కార[illegible]ము. 4

సతత మెడఁబాటులేని నీచరణజలజ
సేవనాసక్తిఁ గల్పించి ప్రోవఁగదవె!
చేరితిఁ బ్రపన్ను నన్ను శాసింపుమీవ;
పరమ యోగీశ! సాయీశ! వందనంబు. 5

అప్రమేయ! దామోదర! హరి! ముకుంద!
అచ్యుతానంత! సర్వేశ! శ్యామలాంగ!
నందనందన! గోవింద! నాగశ[illegible]!
వాసు[illegible]! సాయీప్రభు! వ[illegible]బు. 6

అవ్యయ! మహేశ్వరా! శౌ[illegible]! [illegible]జ్ఞ! వరద!
కృష్ణ! దీనావనా! హృషీకేశ! [illegible]
బృందవందిత! గోవింద! సుం[illegible]గ!
వాసుదేవ! సాయీప్రభు! వ[illegible]బు. 7

యోగివి, [illegible]నంతమూర్తి, [illegible]తుఁడవీవ,
పరమ యోగేశ్వరుఁడవు[illegible]ర్తవీవ,
నతిశతంబులఁ గొను కరుణా[illegible]వ!
శరణాఁజొచ్చితిఁ బ్రోవవే సా[illegible]దేవ! 8

పరమకళ్యాణ! నీకివే, వందనములు,
విశ్వభావన! నీకివే వినతిశతము,
శిర్డినిలయ! నీకివియె జేజేలు వేలు,
శాంత! సాయీశ్వరా! నమస్కారమయ్య! 9

వాసుదేవ! వరద! ప్రణతార్తినాశన!
శంకర! పరమాత్మ! చక్రహస్త!
దేవదేవ! శౌరి! గోవింద! సాయీశ!
వందనములు, నీకు వందనములు. 10

అఖిలలోక శరణ్యుఁడు నార్తిహరుఁడు
సాధువరుఁడు మహాత్ముఁడౌ సాయినాథు
మ్రొక్కు బుధవరేణ్యుల కేను మ్రొక్కువాఁడ,
మ్రొక్కువాఁడను, నిత్యంబు మ్రొక్కువాఁడ. 11

పెక్కు మంత్ర తంత్రములకై వెదకనేల
సాయిపాదాబ్జ భక్తి పొసంగునేని
తలఁపు, ఓమ్ నమ స్సాయినాథాయ" యనెడి
మంత్ర-మఖిలార్థ సాధక తంత్రమగును. 12

సతమున్ వర్తిలునాదు నాల్కపయి మోక్షంబిచ్చు నీనామ,
మీ
శ్రితు మేనన్ బ్రసరించు నీదు కరుణాదృష్టుల్ యథేచ్ఛన్,
సదా
ధృతి నాడెందమునన్ వెలింగెడిని నీ దివ్యస్వరూపంబు, సం
తత మీ నా తలనిల్చు నీపదము దత్తా! సాయినాథప్రభూ! 13

నిజబలము పేర్మి హృదిఁ జొచ్చి, నిదురనొందు
వాక్కులను మేలుకొలిపితి ప్రాణమొసఁగి;
జ్ఞాన కర్మేంద్రియా జీవనంబు నిడితి;
పరమపురుష! సాయీప్రభూ! వందనంబు. 14

ఆకసమునుండి కురియు తోయంబులెల్ల
వారి రాశి నంత్యమునందుఁ జేరునటుల;
దక్కు దేవతలకు నిడు మ్రొక్కులెల్ల
సాయినాథునిఁ జేరు నిశ్శంసయముగ. 15

## శరణాగతి

సాయిగురు! జనరంజన! సాయినాథ!
సాయిప్రభు! సకలాశ్రయ! సాయినాథ!
సాయి! సద్గతిదాయక! సాయినాథ!
సాయి! రక్షణంబిడు మావ, సాయినాథ! 16

సాయిపదములు మనసుచే సంస్మరింతు,
సాయిపదములు వాక్కుచే సన్నుతింతు,
సాయిపదము లాఁదలనిల్పి కేలుమోడ్తు,
సాయి పదయుగంబును సమాశ్రయముగందు. 17

సాయినాథుఁడు తల్లి, శ్రీసాయి తండ్రి,
సాయినాథుఁడు స్వామి, శ్రీసాయి సఖుఁడు,
సాయినాథుని కరుణయే సర్వధనము;
ఇతర మెఱుఁగ నెఱుఁగఁజాల, నెఱుఁగఁజాల. 18

ఆశ్రితారి భీముండు, ప్రేమాభి రాముఁ
డంబుజాక్షుండు, పూర్వపుణ్యైకలబ్ధుఁ,
డఖిల విజయప్రదుండు, దయాంబురాశి
సాయినాథుఁ; డాగుకదేవు శరణుఁగందు. 19

సాశ్రితుల తల్లి; తండ్రియగా సాయినాథు;
సకలకాంక్షావిహీనుఁడౌ సాయినాథు;
సంసరణ వార్ధి పోతమౌ సాయినాథు;
సాధుగురు; సాయిచంద్రునే; శరణుగందు. 20

పొసఁగ నఖిలభావముల నాపరాత్పరు
సాయినాథునొకనె శరణుగనుమి;
శాశ్వతంబుఁ బరమ శాంతిపదంబుఁ గాం
చంగఁగలవు తత్ప్రసాద గరిమ. 21

అఖిల ధర్మంబులను బరిత్యజన చేసి,
సాయి ప్రభువన్యునొకనినే శరణుఁగనుమి;
సాయి సద్గురూత్తముఁడె నిన్ సకల పాప
ముక్తునొనరించు దుఃఖంబుఁ బొందనేల? 22

ధనముల్ గుఱ్ఱము లేన్గులేటికి? సమస్తంబై రాజ్యంబు లే
పని? దారాసుత మిత్రగేహ పశు సంపత్సంచయంబేల? యో
మనమా! యేక్షణమో నశించునివి; సంబంధంబుఁ బోఁ
ద్రోసి, స
బోధన్ వివి, స్వాత్మసిద్ధికయి శ్రీసాయీశు సేవిం
పుమా! 23

## కర్మఫలము — అనుల్లంఘనీయము

కోరుకొను వస్తువది యెల్ల దూరమగును,
దలఁపఁబోని యర్థంబది దాఁపుఁజేరుఁ,
దాఱుమాఱుసేయు విధి విధానమెఱిఁగి,
సాధుజనులు సాయీప్రభు శరణుగంద్రు. 24

ధరణిఁ దప్పక, విధిరీతి జరుగనున్న
పనుల, మాఱుసేతకేదే నుపాయమున్న,
నడవులంబడి యిడుముల బడెసీ వారె
రామచంద్ర నల యుధిష్ఠిర ప్రముఖులు ? 25

సౌఖ్య దుఃఖము లితరు లొసంగఁబోరు,
విధి యొసఁగునివి యనుటయు వెఱ్ఱితనము;
తానె కర్తనంట వృధాభిమానమగు; స్వ
కర్మపాశ బద్ధంబయి కదలు జీవి. 26

యముని తనయుఁడు ధర్మరాజంతవాఁడు,
గదను ధరియించి భీముఁడు, గాండివంబుఁ
గరమునఁబూని నరుఁడు, నిందఱకు నాప్తుఁ
డగుచు శ్రీకృష్ణుఁడున్నెడ దిగులులేదె? 27

## శరణాగతి — ఆవశ్యకత

కనుచుండన్ జను నాయు, వొక్కదినమేగన్ నాశనం
బొందు య
వ్వనమున్, జన్మదినంబురాదు, జగమున్ భక్షించుఁ
గాలుండు, నీ
ధనముల్ బుద్బుద సన్నిభంబులు, తటిత్ప్రాయంబు
జీవంబు, కా
వున, నిన్నే శరణంటి, నీయుమభయంబున్ నేఁడ, సాయీ
ప్రభూ! 28

ప్రబల కాయమున్ గ్రసియించు వ్యాధులెల్ల,
మనసును దహించుఁ గామాదు లనుదినంబు,
మృత్యువు దినంబులెడపి నటించుఁ, గాన,
శరణమిపుడు నాకగు మీవ, సాయిదేవ! 29

అనుదినము మార్పుఁగనెడి కాయము నశించుఁ,
గోరికలఁ జిక్కి చిత్తంబు కుందు సతము,
భోగలాలస యగు నెప్డు బుద్ధి, కాన,
శరణమిపుడ నాకగు మీవ, సాయిదేవ! 30

చిల్లికుండ నీరటు లాయువెల్ల చెడెడిఁ,
బలుచు మెఱుపటు చపల యవ్వన ధనంబు,
దఱిసె సింగము వడిని వార్ధకత, కాన,
శరణమిపుడు నాకగు మీవ, సాయిదేవ! 31

సాధుసేవ నీభక్తికి సాధనంబు,
చదువు పొగరునఁ గుదురదా సాధుసక్తి;
అదియె, మొదలైన జ్ఞాన మెట్లమరుఁ? గాన,
శరణమిపుడ నాకగు మీవ, సాయిదేవ! 32

భూతములయెడ సమదృష్టి పొసఁగదయ్యె,
భేద బుద్ధియ నాలోనఁ బాదుకొనియె;
సమత లేకున్న నెటు గల్గు శాంతి? - కాన,
శరణమిపుడ నాకగు మీవ, - సాయిదేవ! 33

వెలి విషయసక్తి నింద్రియంబులు చలించు,
లోని చూపులే దింద్రియాధీన మతికి,
నిన్నువిడిన సౌఖ్యంబది యున్నె? కాన,
శరణమిపుడ నాకగు మీవ, - సాయిదేవ! 34

జ్ఞాన సంసిద్ధికై గురు చరణసేవ
నియమవిధిఁ బొనరింపఁగ నేరనైతి;
తత్ప్రసాదాప్తికదియె సాధనము; గాన,
శరణమిపుడ నాకగు మీవ, సాయిదేవ! 35

దివ్య షిరిడీవాస! యార్తి ప్రణాశ!
ద్వారకామాయి భవన విహార! సాయి!
నీపదాబ్జముల్ తక్క వేప్రాపెఱుంగ, 36
కానఁ గరుణించి యిడుమి సద్గతిని దేవ!

కన, వైరాగ్య వివేకశీలములు నాకాలేవు; లేదయ్యె సా
ధన షట్కంబు ముముక్షు సంపద; విశుద్ధ జ్ఞానమేరీతిఁ గ
ల్గును?-సంసార మహాబ్ధి తారకము నాకున్ జూపి, శ్రాంతి
ప్రబో
ధ నిదానంబగు బుద్ధినిమ్ము; కరుణాంతస్సార! సాయీ
శ్వరా! 37

సాదరమున, నచ్యుతా! రామ! శ్రీకృష్ణ!
సాయి! యనెడి నామ సంస్మరణమె;
ఔషధంబు:- దీన నడఁగు రోగములెల్ల
నేన పలుకుచుంటి;- నిజము, నిజము. 38

తొమ్మిది రంధ్రమ్ముల దే
హమ్మిది, రోగములఁజెడిన, నౌషధ, "ముధీ-తీ
ర్థమ్ములె";- యనుభవ వైద్యం
బిమ్మహి సాయీశుఁడౌ మహేశ్వరుఁడొకఁడే. 39

సాధు ధర్మశీలుఁడు సత్యసంధుఁడైన
సాయినాథుఁడు శ్రీ శేషశాయియేని,
సాటిలేని సామర్థ్యమెసంగునేని,
జాడ్యములఁ బాపుమీ-"యుధీ!" సత్వరముగ. 40

నీదు పాదాశ్రయముఁ గననేరకున్న
వారి కాపదల్ గూర్పఁగ వలఁతివీవ;
ప్రాణికోటి కాపదలనుఁ బాపఁజేయఁ
జాలుమేటి వీవొకఁడవ, సాయిదేవ! 41

# సాక్షాత్కారము

పెక్కుజన్మల సుకృతిఁ గావించియున్న
సజ్జనులకె సద్గురుసేవ సాధ్యమగును,
సేవలను బ్రీతిఁగను గురుదేవు, డట్టి
వారిఁ గరుణించి స్వాత్మరూపంబుఁ జూపు. 47

ఆశ్రితు లెవార లేరూపమందుఁ గాంక్ష
సేసి నీయందు దాని వాంఛించుచుందు,
రట్టివారికై యారూపమంది తోఁతు
రూపహీనుఁడవయ్యు సాయీ! పరాత్మ! 48

జనములకు నీదు పదభక్తి సక్తి వేల
కొలఁది జన్మలకావలఁ గలుగుచుండు,
కలియుగమునఁ గేవల భక్తిబలము కతన
సాయికృష్ణుండు మ్రోల సాక్షాత్కరించు. 49

దేవతల, భూసురుల, మంత్ర తీర్థములను,
ఔషధమున, దైవజ్ఞునియందు, గురువు
నందు, నెంతెంత విశ్వాస మమరుచుండు,
నరయ నంతంత ఫలము సంప్రాప్తమగును. 50

అమిత మధురమా సాయీకథామృతంబు
తనివిదీరఁగ నేఁగ్రోలు తరుణమందు
పిలుపువిని వేగడాసెడి భృత్యువగిది
స్వాంతమందు శ్రీసాయి సాక్షాత్కరించు! 51

ప్రేమ నిర్ఝరి హృదియందు వెల్లివిరియఁ
గనుల నశ్రులు గ్రమ్మ గద్గదిక దోఁప,
ప్రభుపదాబ్జ సంస్మరణంబుఁ బఱపు నాదు
స్వాంతమందు శ్రీసాయి సాక్షాత్కరించు. 52

## సాక్షాత్కార ప్రార్థన

నీదు శరణుఁ జొచ్చి నీదు సందర్శన
కాంక్ష నున్న నాదు కనుల యెదుట
నవతరింపు, మందహాస శోభిత ముఖా
బ్జంబు కరుణఁ జిలుక సాయినాథ! 53

నీకుఁ దోఁచినట్టు లేకాలమందైన
రూపరహితవో యట్టి రూపుదాల్చి,
లోకమం దసాధ్యమౌ కార్యములఁబెక్కు
సలుపుచుందు వీవు, సాయిదేవ! 54

అరయఁగ నామరూప విలయంబులు లేక, ప్రసాదకాంక్షఁద
చ్చరణ సరోజ సేవలను సల్పు కృతజ్ఞ కరంబునోమ నా
దరమున నామ రూపములఁదాల్చి స్వలీలఁజాటు మేటియౌ
పరమ దయాంబురాశి భగవానుఁడు; సాయి ప్రసన్నుఁ
డవ్యయుఁడు. 55

## శ్రీ సాయి రాము నేకాంశమిా సకలజగము

ముజ్జగములనిండు భూతాత్మ హరి కల్మి
వివిధ భూత వితతి వేఱువేఱ
సకల కర్మఫలము లనుభవించును గాన
విష్ణు వవ్యయుండె విశ్వభోక్త. 56

ప్రాణివితతి కంతర్యామి యగుచు నెవ్వఁ
డఖిల భూతములఁ జొచ్చి యాత్మబలము
కలిమి ధరియించు; నెవని యాజ్ఞలకు వశుల;
మిాశుఁ, డాసాయివిభుఁడు రక్షించుమమ్ము. 57

పంచభూత మూలంబౌ ప్రపంచమునఁ జ
రాచరములు వేర్వేరుగ గోచరించు;
నటుల, నొకఁడవయ్యును భిన్నమగుచుఁ దోఁతు
చాచర నీయందు గలుగు జీవులను సాయి! 58

తగ రజస్సత్త్వ తామ సాత్మకగుణముల
బలమున సృజించి ప్రోచి విశ్వమునడంతు;
వట్టి గుణ కర్మములచేతఁ గట్టుపడవు;
జ్ఞానమయునకు బంధమెక్కడిది? సాయి! 59

తనువులా ద్యుపాధులు కల్పితంబులగుట
భిన్నగతులాత్మయెడ నిరూపింపరాదు:
కాన మవివేక మనునవి కలవెనీకు?
లేక బంధంబు - మోక్షంబులేదు, సాయి! 60

యతివర్గంబులకున్ సురాదుల కలభ్యంబౌదు, నీ మహాపురా
కృతమౌ పుణ్య విశేషమెట్టిదియొ! శ్రీడిన్ నిల్చి
మమ్మోమ్ము బా
ధ్యతఁగైకొంటివి; సతీసుతాది బహుళింబౌ నీదు మాయాపరి
కల్పిత మోహాంచిత బంధముల్ దునుమ రావే! సాయి
నాథ ప్రభూ! 61

సత్యమిది-పరబ్రహ్మము సాయి యగును,
సాయికంటెను భిన్నమెచ్చటను లేదు;
కాన, నీ గోచరించు జగంబులెల్ల
సాయినాథ స్వరూపముల్- సత్యమింత. 62

సాయియె యుత్తమ వేదము
సాయీశుఁడె యుత్తమంపు జన్మంబయగున్,
సాయియె యుత్తమ యోగము,
సాయియె యుత్తమమగుక్రియ, జగములయందున్. 63

సాయియె పరమ జ్ఞానము,
సాయీశుఁడె పరమతపము, సకల తపములన్;
సాయియె పరమగు ధర్మము,
సాయియె పరమగతి ప్రాణి సంచయములకున్. 64

లాభమెది పొంది కోరమే లాభములను,
సౌఖ్యమెది పొంది తలఁచమే సౌఖ్యములను,
జ్ఞానమెది పొంది తలఁపమే జ్ఞానములను,
అదియె సాయీశుఁడీ రహస్యంబుఁగనుమీ! 65

చూచి యెద్దాని నితరంబుఁ జూడఁబోము,
పొంది యెదాని భవములఁ బొందఁబోము,
ఎఱిగి యెద్దాని నన్యంబు నెఱుగఁబోము,
అదియె సాయీశుఁ డీ రహస్యంబుఁగనుడి! 66

## శ్రీ సాయీనారాయణ మంత్రము

పారమార్థికముగ భగవానుఁడగు సాయి
పరగును సదస త్ప్రపంచమగుచు;
నరయ నిట్టి సత్య మాధారముగ మన
సంకటంబులెల్ల సమయుఁగాత! 67

బ్రహ్మమైన తాను వికల్పరహితుఁడయ్యుఁ
బ్రాప్యమగుచు నాత్మకామ్యను భావులకును,
తనువు నాభరణాఖ్యాయుధముల శక్తి
మహిమల వెలింగెడిని తన మాయకలిమి. 68

సత్యములుగ వెలుఁగు సకలరూపముల స
ర్వజ్ఞుఁడైన సాయి ప్రభువరుండు
ఎల్లగతుల మనలనెల్లర నేకాల
ములను నెల్లయెడలఁ బ్రోచుఁగాత! 69

స్వీయ తేజమునను బెర తేజులగ్రసించు
శ్రీ విభుండు నారసింహ సాయి
వెలిని లోన దిశల విదిశలఁ గ్రిందఁ బై
నఖిల లోక భయము లడఁచుఁగాత. 70

సాయి గురువరేణ్యు శరణొందు వారల
కశుభ మెందు లేశమైన లేదు;
జనన మరణములును జరయు రోగంబులు,
భయము వారలెప్పుడుఁ బడయఁబోరు. 71

## హితబోధ—ఆశ్రయము

చేతులెత్తి బగ్గఱ బోధసేయువాఁడ
భవ్యమతులు జనుల్! వినవలయుఁ బ్రేమ;
భవ మహాభయంకర విష వారకంబు
'సాయినాథాయ నమ' యను జప్యమిలను. 72

బహుళ విష దూర్మి యుత భవవార్ధి మునిఁగి
గతిఁగనని జనములు నాదు హితము వినుడి!
భ్రాంతినుడిగి వేమఱు జపింపంగ మేలు
దనరు "ఓమ్ నమః సాయినాథాయ"-యనుచు. 73

ఇతర శరణంబు లేశమే నెఱుంగ,
నాకు నీవొక్కఁడవె శరణంబగుదు;
కాన, నీదుకటాక్ష వీక్షణముఁ బఱపి
సతము రక్షింపు, రక్షింపు, సాయినాథ! 74

ఆయాశపడని మరణముఁ,
జేయించఁగఁబోని జీవన సరణిన్,
నీయెడ నిశ్చలభక్తిని
సాయీ! నాకొసఁగుమోయి! సదయుఁడవగుచున్. 75

ఏవరముఁగోర నేను సాయీ మహేశ!
సతము గలుగుత నీపాద జలజ భక్తి;
ఏను ప్రార్థించు ప్రియవరంబిదియె, నాథ!
మరల మరల నిన్ ప్రార్థింతు వరము నిదియె. 76

సాయినాథునందు సతతంబు భక్తియు,
సాయిభక్తి జన్మ జన్మమందు,
సతము గల్గుఁగాత-సతముగల్గుత; సుని
శ్చలముఁగాఁగ సతము గలుగుఁగాత! 77

సాయి! నీపదకంజ పంజరమునందు
నీక్షణము చొఱనిమ్ము నా హృదయహంసి;
నంత్యమున కఫ వాత పిత్తాదికముల
కంఠమెడర, నిన్ స్మరియింపగలనో? లేనో? 78

సాయినాథ! నాకియ్యెడ జననమొసఁగు
కతన నేమేమి యొనరింపఁగలను నీకు?
దేవ! నీ కృపమాత్రి వర్తింతు; నాదు
విధులొనర్పఁగ నిడు జ్ఞాన వీక్షణంబు. 79

ఎంచఁగ నీవకించనులకే లభియించెడివాఁడ కావె?- వాం
ఛించను నీపదాంబురుహసేవల కన్యము; నీదురూపు ధ్యా
నించెడి ధీవిశాలి యెవఁడే నపవర్గమొసంగు నిన్ను యా
చించునె యాత్మబంధనరచించు వరంబులఁ? సాయిసద్గురూ! 80

కనినన్ సత్త్వ రజస్తమో గుణనియుక్తంబౌట నాయావరా
ళిని బంధంబిడునంచుఁ ద్రోసి, గతమాలిన్యప్రభావున్, నిరం
జనునిన్, నిర్గుణు, నద్వయున్, బురుషునిన్, సర్వేశ్వరున్,
సర్వుఁ, జి
ష్ణును, జిన్మాత్రు నినున్, భజించెద మహాత్మా! సాయి
నాథ ప్రభూ! 81

ధర, 'సంసారము'నందు సారమెది? కాదా యుత్తరార్ధంబు?
యా
సరణిన్జూచిన 'శేషశాయి' యనినన్ సారంబెదో? 'శాయి'
యన్
పరభాగంబగు; 'శాయి' లేక నరతత్త్వంబౌను 'శేషాఖ్య'; నీ
శ్వరశక్తిన్, 'శ,స,' లంద భేదమగుటన్ 'సాయి' ప్రపూ
రించెడిన్. 82

## జ్ఞానము

తెలివిని దగ సమకూర్చి
యలసత మోహంబులుడిపి యతివర్యుఁడు ని
ర్మలుఁడున్ జ్ఞానాకృతియై
వెలిగెడి గురు సాయినాథు వినతి భజింతున్. 83

"ఎవఁడవీవు? నేనెవ్వఁడ? నెచటవార
మేల? యని తత్త్వమును విచారించుకొనుమి"
అనుచు బోధించు సాయీమహాత్ముఁ డెపుడు
ప్రీతి మనబుద్ధులెల్లఁ బ్రేరేచుఁగాత. 84

గురువు కృపలేకయే మాకుఁ గుదురఁబోవ
దాత్మచే నాత్మదర్శన ప్రాప్తియెందు;
కాన. కరుణా కటాక్ష వీక్షణముఁ బఱపి
స్వాత్మరూపంబుఁ జూపింపు సాయినాథ! 85

## బ్రహ్మానంద నిర్వచనము

దేహ చిత్తేంద్రియముల కతీతమగుచు
నాది మధ్యావసానంబులందు నెద్ది
ప్రవిమలాత్మ ప్రసాద సంభవము నగునొ
యట్టి స్థితియె 'బ్రహ్మానంద' మనఁగఁబడును. 86

కామ మొనరించె, నొనరించెఁ గాను నింత
కామమేచేయు, నేఁజేయ; కర్త కామ
మేను కర్తనుగాను; చేయించుఁగామ
మేనుఁజేయింప; కామను! మానసమున
కామమును వేల్తు నిదియె యాకామమందు. 87

క్రోధ మొనరించె, నొనరించెఁ గ్రోధమింత;
క్రోధమేచేయు, నేఁజేయఁ గ్రోధమగును
కర్త; నేన్‌గాను; క్రోధమేకారణంబు,
ఏనుగాను, క్రోధమ! నీకు నిదియె వేల్తు
వందనంబులు వేవేలు వందనములు. 88

ప్రణవంబె బ్రహ్మంబగు,
ప్రణవమె వాయువగును, ప్రణవమె సత్యంబా,
ప్రణవమె యీ సర్వంబగు,
ప్రణవంబౌ సద్గురునకుఁ బ్రణతులొనర్తున్. 89

సకల భూతంబులందున సంచరింతు,
వెల్ల భూత హృత్సీమ వసింతువీవు;
ఈవ యజ్ఞ మీవే మంత్ర, మింద్రుఁడీవ,
ఈవ రుద్రుండు, విష్ణుండవీవ, నీవ
బ్రహ్మయగుదువు, మఱి ప్రజాపతివి నీవ,
అంబువులును దేజంబు రసంబు నమృత
మైన బ్రహ్మంబు లోకత్రయంబు, భూర్భు
వస్సు వర్లోకములు ప్రణవంబు! నీవ! 90

## సిద్ధాంతము

శాస్త్ర గురుబోధలను మఱి స్వానుభవము
కలిసి నెద్దాని నరుఁడేరుగడగ నమ్ము
అదియె శ్రేష్ఠంబు; పరమమౌ నదియు; యనె ...
గంబునన్ వాని కవలంబనంబు, సాయి! 91

## అలిప్తస్థితి

తత్త్వవిదుఁడైన యోగి యెద్దానినైన
దాను జేయనటంచును దలఁచు; వినుచు
గనుఁచు, దాఁకుచుఁ జనుచు, మూర్కొనుచుఁ దినుచు
నూర్పులడరుచు నిద్దుర నొందుచుండి. 92

చక్కఁ బలుకుచు విసర్జించుచును గొంచుఁ
గన్నులను దెఱచుచుఁ గనులమూయు
చింద్రియములు మాత్ర మింద్రియార్థముల వ
ర్తింమననుచు నిశ్చయించుకొనును. 93

ఆయుధంబులు నన్ దెగవేయలేవు
పావకుండేని నన్ను గాల్పంగలేఁడు
జలములీనన్ను దడుపఁగాఁజాలవెపుడు
వాయువేనియు శోషింపఁజేయలేఁడు. 94

తఱుప ఛేదింప శోషింపఁ దగులఁబెట్ట
సాధ్యపడ దెప్పుడీ నేను సర్వగతుఁడ
నాశరహితుఁడ స్థిరుఁడ ననాదియైన
వాఁడ శుద్ధ బుద్ధుండనై పఱగువాఁడ. 95

జననమేనొంద నెటులుండు జన్మమృతులు?
ప్రాణమేనుగా నెటు క్షుత్పిపాసలొదవు?
స్వాంతమా కాను, శోక మోహంబులున్నె?
కర్తనా, కాను, బాధ మోక్షములుగలవె? 96

అఖిల భూతసంచయ హృదయములనుండు
ఆత్మనేనని 'చందోర్కర్'!ఱ ఱయుమయ్యా!
దోమలీగలు మఱి చిన్న చీమలుగను
నాకిడు పదార్థముల భక్షణంబు సేతు. 97

అంతరంగేంద్రియములుఁ గాయంబుఁగాను
గా నహంకార ప్రాణవర్గములు, బుద్ధి;
తనయ తరుణీధనాది బంధములఁగనను
స్థిరుఁడ, ప్రత్యగాత్మను సాక్షి శివుఁడ నేను. 98

మనసు బుద్ధి చిత్త మహంకృతినగాదు,
రసన నాసికా శ్రోత్ర నేత్రములుగాను,
క్షమ జలాగ్ని వాయు గగనములుగాను,
శివుఁడ, సచ్చిదానందాత్మ శివుఁడ నేను. 99

పాసఁగదాకృతి, నిర్వికల్పుఁడను, విభుఁడ,
నింద్రియముల నెల్లెడ నావరించియుందు,
సర్వసముఁడను, బంధ మోక్షములు లేవు,
శివుఁడ, సచ్చిదానందుఁడౌ శివుఁడ నేను. 100

ఒక్కఁడను—లోన వెలినుండు పెక్కురగుచు
లోన జ్ఞానంబు — వెలిని నజ్ఞానసరణి,
త్యాగరతి లోన వెలిని బంధప్రసక్తి,
గలిగి క్రీడింతు నేను లోకంబులందు. 101

## లయధ్యానము

కమలమందు నంబు కణమే యుండినను
ఉదయమందు మయాంశమో సుధాకర!
కమలమునకుఁ దగు వికాసము సమకూర్చి
జలధియందు నన్నుఁ గలియనిమ్ము 102

"ఓమ్ ఘృణిసూర్య-ఆదిత్య"! - ఉదయమొందె
నా ప్రభాకరుఁ, డాదిమధ్యావసాన
ములను నెయ్యది జలమొ, యాజలకణంబు
పూర్ణమై వెలింగెడి మహాంబుధినిఁ గలిసె. 103

## ప్రతిజ్ఞ — ప్రార్థన

బంధుజనులు నను వీడిన
నిందించిన గురు జనములు నిష్ఠుర ఫణితిన్
డెందమున వెలుఁగు పరమా
నందుఁడు 'శ్రీసాయి', జీవనంబగు నాకున్. 104

సాయిసూక్తి ప్రత్యేకైక శాస్త్రమగును,
సాయినాథుఁడె నిజ దైవమై యెసంగు,
సాయినామ మంత్రమె నాకు జప్యమగును,
సాయిసేవ యొక్కటె కర్మమై యెలర్చు. 105

కినుకన్ బంధులుదూరనీ, గురుజనుల్ గేలీయనీ, త్రోయనీ;
జనముల్ కేకిసలాడనీ, కలత వంశంబందు రేకెత్తనీ;
యనిశప్రేమ భరానురాగ ముదితంబౌ నాదు హృద్భృంగమే
క్షణమేన్ మానునె సాయినాథ చరణాబ్జాతామృతా
స్వాదనల్! 106

బాహులెత్తి సత్యంబు నేఁ బలుకువాఁడ
కృష్ణ! సాయి! నృసింహ! యంచెవఁడు తలఁచు
నతఁడు మృతివేళఁ బాషాణ మటులఁబడిన
సాయిప్రభువు వానికి నభీష్టములుగూర్చు. 107

వెనుకను ముందును గెలఁకుల,
ననయముఁగను జాగరూకుఁడై నిజపద భ
క్తుని నన్నుఁగాచు బలవ
ర్ధనుఁ డఖిలవ్యాపి సాయిప్రభు ననురక్తిన్ 108

గత నేత్రున కేకాక్షియ
గతి; యేకాక్షికిని ద్వ్యక్షి గతి యన్యేడి, నీ
క్షితి, ద్వ్యక్షులైన మనుజ
ప్రతతికి ముక్కంటిసాయి పరమ గతియగున్. 109

సర్వమెందుండు, నెటనుండి సర్వమొదవె,
నెవఁడు సర్వంబునన్ సర్వమెవనియందు
నుండు, నెవ్వఁడు సర్వమయుండో, యట్టి
ప్రభువు సర్వాత్మ సాయికిఁ బ్రణతిసేతు. 110

వందనము పరాత్మునకున్
వందనమాత్మప్రదీప భాస్వంతునకున్
వందనము వాఙ్మనంబుల
కందని సాక్షియగు సాయి, కఖిలాత్మునకున్, 111

అంజలి, పరేశుఁడైన బ్రహ్మణ్యునకును,
వందన, మనంతశక్తి సంపన్నునకును,
మ్రొక్కు, లఖిల రూపునకు నరూపునకును,
ఎఱుక, లాశ్చర్యకృతికి, సాయీశ్వరునకు. 112

'శరణ'ను వారి కష్టముల సర్వము రూపడఁగింప దక్షుఁడై,
పరమదయాబ్ధియై, బహుళ పాపకుజంబులకున్ గృపాణమై,
చరణగత శ్రితాంబుధికి శారద పూర్ణిమ చంద్రబింబమై
పరగు వరిష్టు, శిర్డిపురవాసిని, సాయివిభున్ భజించెదన్. 113

దాచక గల్గిన నావివేక మహితార్థంబెల్లఁ గైకొంచుఁ బ్ర
జ్ఞాచక్షుస్థితి లేనిసన్ బలిమి నజ్ఞానాంధ కూపంబునన్
ద్రోచెన్ స్వేంద్రియ తస్కరోత్కర, మిఁకే త్రోవన్ గనన్ లేనిసన్
నీ చేయూఁతనొసంగి ప్రోవఁగదె! తండ్రీ! సాయినాథ ప్రభూ! 114

జనభీమంబు నగాధమూలమగు నీ సంసార కూపంబునన్
గనమిన్ గూలితి, దుఃఖ సర్పశతముల్ గాటించుచున్ గ్రమ్మఁ, ద్రో
వనెఱుంగన్, గృపణుండ, దీనుఁడను, నీ పాదాబ్జముల్ ప్రాపుఁ గం
టిని చేయూఁతనొసంగి ప్రోవఁగదె! తండ్రీ! సాయినాథ ప్రభూ! 115

నాసముఁడగుఁ బాతకియును
నీసముఁడగుఁ బావనుండు నిజముగ లే, రీ
పీ సంగతిఁగని విహితం
బౌ సరణిని దగ విధింపుమా! సాయివిభూ! 116

పుడమిపైఁ గాలుజాఱుడుఁ బడినయట్టి
వానికాధారమైన దీవసుధ యగును;
నీయెడల నపరాధముఁ జేయు నాకు
కలదె మఱి పట్టుఁగొమ్మ నీకంటె? సాయి! 117

నిండు కరుణ నాపయిని నీకుండెనేని
స్వామి! సాయి! విచిత్రమిందేమికలదు?
పెక్కు లపరాధములను గావించియున్న
తనయుని నుపేక్షసేయునే యనుఁగు జనని? 118

ఏనిపదాంబుజాతముల హృత్కమలంబుల నిల్పి సంతత
ధ్యానసమాధులన్ గలుపమంతయుఁ బాసిన బుద్ధి, నాత్మగో
త్త్వానుభవంబు, తోచినటులాడుదురో కవు, లట్టి, యోగి
ర్వాణుఁడు, సాయినాథభగవానుఁడు, నాకుఁ బ్రసన్నుఁ
దయ్యెడున్ 119

"సాయినాథ! సాయీశ! శ్రీసాయి!" యనుచు
నెల్లరకు నెల్లయెడల వచింపనగును;
సాయివిభుమయంబీ జగజ్జాతమెల్ల;
సాయి గురువరు నుపదేశ సారమిదియె. 120

సాయినాథుని నెవఁడు గాంచంగలేఁడు,
సాయి ప్రభువర్యుఁ డెవనిఁ గాంచంగలేఁడు,
వాఁడు లోకంబులన్ నింద వడయుచుండు;
ఏవగించు నాతని యాత్మయేని సతతి. 12[illegible]

శంకరాచార్యునందు నీశ్వరుని యందు
సాయినాథునందును శేషశాయియందు,
వస్తుభేదంపు బుద్ధి లవంబులేను,
కాని, సాయీప్రభువునందు కలదు భక్తి. 122

సకల కల్యాణనిధి శేషశాయి, సాయి,
యెవరి హృదయాంబుజముల వసించియుండు
వారికెల్లవేళల నెల్లపనులయందుఁ
గలుగు విజయముల్, కళ్యాణ గౌరవములు. 123

## ఫలశ్రుతి

శ్రీయును బలము నరోగము
ధీయుక్తియు వాక్పటుత్వధృతులు నజాడ్యం
బాయువు యశోవిశాలత
సాయీనాథుని స్మరింప సంప్రాప్తమగున్. 124

హృదయ పద్మస్థుఁడై సతంబెసఁగువాని,
సతత మభయ మాశ్రితుల కొసంగువాని,
నవ్యయుననంతు సాయీశు నాశ్రయించు
వారు పరమవైష్ణవసిద్ధిఁ బడయుచుండ్రు. 125

అనిశము సద్భక్తినిఁ బా
వన మాయుష్కరముఁ బుణ్యవర్ధన మఘనా
శనమగు శ్రీ సాయీప్రభు
మననముఁ జదివినను వినిన-మహితార్థమిడున్. 126

కష్ట పాపసంచయము లొక్కటనం దొలంగు
సుస్థిర ప్రజ్ఞ, జీవన సుఖములొదవు
సత్యముగ సాయినాథ ప్రసాదగరిమ
సత్వరమకల్గు సర్వార్థ సాధకంబు. 127

జగముల సృజించి పెంచి పెల్చనగ్రసించు
నజ హరిహార రూపకుని విశ్వాధిపతిని,
సాయినాథుని యెడ, భక్తినలుప నేర్చు
వారి కపజయంబు, పరాభవంబు లేదు. 128

కరచరణానుషంగములఁ గాయక వాచక కర్మజంబులన్,
బోఁటి, శ్రవణేక్షణా హృదయ మూలములో నపరాధ
సంచయం
బెఱిఁగియొ నేనెఱుంగకయొ, యేమొనరించితినో, క్షమింపు,
మీ
శ్వర! కరుణాకరా! జయము! సర్వవిధాయక! సాయి
నాయకా! 129

నీవె తల్లివగుదు నీవె తండ్రియునైన
నీవె బాంధవుండవు నీవె సఖుఁడవు,
నీవె, విద్యయగుదు నీవె ధనము నాకు
సకలమగుదు నీవె సాయిదేవ! 3

తనువుచే, వాక్కుచేతను, మనసు నింద్రి
యములచేఁ బుద్ధిచే, మఱి యాత్మచేత,
స్వ స్వభావానుసారినై సలుపునట్టి
సకల మర్పించెదను, నీకు, సాయినాథ! 131

సకల మంగళాకరుఁడౌట సాయినాథు
నెవరు హృది నిల్పి సతము ధ్యానించి కొలుచు
చుంద్రు, వారలకౌదవు నిత్యోత్సవంబు,
నిత్యమంగళంబులును, మఱి నిత్యలక్ష్మి. 132

ఎవరి హృది మందహాసో
దార ముఖాబ్జుండు సాయి తగ నిలుచునో, య
వ్వారికి జయ లాభములగు;
వారలెఱుఁగరు పరాభవాపజయంబుల్. 133

పాపంబులు శమయును, సం
తాపంబులు డుల్లుఁ, బాయు దారిద్ర్యంబుల్,
ప్రాపించు సౌఖ్యసంపద,
నీపాద శ్రవణ మనన నిష్ఠన్, సాయీ! 134

వరగురు సాయినాథ పద వారిజముందెద లీనమొంద, ద
త్పర వచనాంబులన్ గలుష పంకము డుంగఁగ నాలకించి, యే
తరుణమునందుఁ దద్గుణ వితానము వాక్కులఁబ్రస్తుతించి, మే
లెఱుకను గన్నుదోయి ముకుళించి సుఖించును భక్తుఁ
డెప్పుడున్. 135

ఏవిభుని శివుఁడంచు శైవులు ధ్యానింతురు,
విష్ణువటంచును వైష్ణవులును,
వినతి 'బ్రహ్మ' యటంచు వేదాంతులెల్లరు,
బుద్ధుఁడటంచును బౌద్ధచయము,
ఆరయ 'కర్త' యటంచు నైయాయికుల్,
మహి "కర్మ"యనుచు మీమాంసకులును,
'అల్లా' యటంచు మహమ్మదీయులు, నజ
స్రంబు "అర్హత్త"ని జైనచయము,

ఆవిభుని సర్వరూపంబు లైనవాని,
నాగమాతీత పథమునం దలరువాని,
సాధు దీన సంరక్షణ సలుపువాని,
సర్వ సులభు సాయీప్రభు సన్నుతింతు. 136

కవితా చాతుర్యంబును,
ప్రవిమలభక్తియును, శుభ సుభాషాప్రజ్ఞల్
దవులవు; నీసత్ప్రద భ
క్త్యవకాశముఁగంటి నీదయన్ సాయిప్రభూ! 137

సాయినాథ పాదాంబుజాశ్రయము కతన
సఫలమై పెనుపొందె నాజన్మ మేడు,
సకల తపము లిత్తఱి నాకు సఫలమొందె,
సకల కర్మలిద్యోడ నాకు సఫలమొందె. 138

నేను కృతకృత్యుఁడను ధన్యుఁడేన యగుదు,
హిత సముద్ధృతిఁ గనిరి నాపితరులెల్ల,
సాయినాథుఁడు నిజభక్త సహితుఁడగుచుఁ
జేరి నా కుటీరమున వసించు కతన. 139

దొర! నీవ ఆత్మవిధునియే మనంబు
పరి జనుల్ ప్రాణముల్ వపువే గృహంబు;
కల విషయోప భోగములె నీపూజ,
తెలియనిదనియె సమాధిస్థితి రాజ!
పలుతిరిప్పటలు శుభాస్పద ప్రదక్షిణలు,
పలికెడి పలుకులే భవ్య సంస్తుతులు;
సెగడు నేనొనరించు నిఖిల కర్మంబు
లగు సాయి! నీదు సమారాధనంబు. 140

శ్రీ సాయీప్రభు మననం
శాస్త్రియు భక్తి యోర్పు లలరఁగ నెపుడే
నాసాంతంబుఁ జదువు విను
నాసజ్జనములకు నతి సహస్రములిడుదుర్. 141

ఎల్లరకును సౌఖ్యములు వర్ధిల్లుఁగాత!
ఎల్లరారోగ్యముగను జరింతురిగాత!
కరము శుభముల నెల్లరుఁ గాంతురిగాత!
ఒక్కరేన్ వ్యసనము లొందకుందురిగాత! 142

జలనిధి జలములఁగొని యా
జలనిధికిఁ దర్పణంబొసఁగు నటుల, నీ
పలికించిన పలుకులఁ గృతిఁ
బలికి సమర్పింతు, సాయిబాబా! కొనవే! 143

అఖిల భారత సాయి సంఘాధినేత
యైన నరసింహు నమృతోక్తి ననుసరించి
తెనుఁగునఁ సాయిమనన తృతీయసర్గ
మప్పనముసేతు నిదె కొనుమయ్య! సాయి 144

స్వస్తి వ్యయ వత్సరంబునఁ జైత్రశుద్ధ
దశమి గురువారమున భవతారకముగ
"సాయిమననంబు" పలికి యాసక్తి నీకొ
సంగు నన్ను, నీకృతిఁ, గొమ్ము! సాయినాథ! 145

శ్రీ సాయీమననము — తృతీయ సర్గము

సర్వము - సమాప్తము.

శ్రీ సాయీనాథార్పణమస్తు.

ఓం - తత్ - సత్.

# శ్రీ సాయికరుణ

సోదర భక్తులారా!

'శ్రీ సాయికరుణ' ముద్రణమునకు సిద్ధముగనున్నది. అఖిలభారత సాయిసంఘాధ్యక్షుఁడు- పూజ్య శ్రీ. బి. వి. నరసింహస్వామిగారిచే కూర్పఁబడిన "Charters and sayings of Sri Sai Baba" అను ఆంగ్లకృతిని, మఱి యితరకృతులను, ఆధారముగఁ జేసికొని బాబా పలికించినవిధమున 'శ్రీసాయికరుణ' అనుకృతిని తెలుఁగున గద్య పద్యములలోఁ బలికియుంటిని. ఇందు 4 భాగములుగలవు, శ్రీసాయిబాబా అభయప్రదానములు - బోధలు - వివిధభక్తులను పురస్కరించుకొని బాబా ప్రవచించిన పెక్కు ఆధ్యాత్మిక విషయములు కలవు

ఈగ్రంథము షుమారు 160 పుటలుండును. ముద్రణమునకు రు. 500-0-0రు అంచనా వేయఁబడినది. 50మంది పోషకులు రు. 10 0-0 లు చొప్పున సహాయము చేసిన 'శ్రీ సాయికరుణ'ను ముద్రింపించి బాబా భక్తసమాజములకు, పూజానుదినములకు, ఉచితముగ అందింపఁగలను. ప్రతి పోషకునకు పది ప్రతులు పంపఁబడును. ఈ కృతిరూపమగు శ్రీసాయిసేవకు తాము చేయూతనిచ్చి శ్రీ సాయికరుణకు పాత్రులగుదురని ప్రార్థించువాఁడను. శ్రీ సాయినాథుఁడు తన బిడ్డలనెల్లరను సంరక్షించుగాత!

చిన్నగంజాము P. O.
(గుంటూరుజిల్లా)
15—7—1953

ఓం శ్రీసాయి!

ఇట్లు,
భక్తజన విధేయుఁడు,
బాపట్ల హనుమంతరావు.

## రచయితచే రచింపఁబడి ముద్రితములైన గ్రంథములు

(పునర్ముద్రణము గాఁదగినవి)

శ్రీమద్భగవద్గీతామృతము.

(భగవద్గీత శ్లోకములు - తెలుగు పద్యములు)

ప్రబోధ సుధాకరము. శ్రీ శంకర భగవత్పాద రచిత ప్రకరణ గ్రంథము. (శ్లోకములు - తెనుఁగు పద్యములు)

ఆశ్చర్యచూడామణి. (శ్రీరామ చరితము - శక్తిభద్ర కృత సంస్కృతనాటకమున కాంధ్రానువాదము)

### శ్రీ సాయి లీలా ప్రచురణములు.

శ్రీ సాయిబాబా పూజా స్తవములు. 0-8-0

శ్రీకృష్ణ కర్ణామృతము.

లీలాశుక సంస్కృత కృతికిఁ దెనుఁగు గీతములు 1-0-0

శ్రీసాయిమననము. (8 సర్గములు) తెలుఁగుపద్యములు 1-0-0

### ముద్రితము కావలసిన గ్రంథములు

శ్రీ సాయికరుణ. (4 భాగములు) బాబా అభయప్రదానములు - బోధలు - నైతిక - ఆధ్యాత్మిక విషయములు కలది

శ్రీసాయి లీలామృతము. (8 భాగములు) శ్రీ దాసగాణూ మహారాజకృత మహారాష్ట్రకృతికి అనువాదము (తెనుగు ద్విపదకావ్యము)

ప్రేమామృతము. (నారద భక్తిసూత్రములు - టీక - తెనుగు గీతములు - వివరణ గీతమాలిక సహితము)

శ్రీ సాయి కబీరు సూక్తులు. (సాఖీలు - తెనుగుద్విపదలు)

శ్రీ సాయిబాబా కూడ దేవుఁడేనా ?

(సందేహ నివృత్తి - వచనకావ్యము)

శ్రీ సాయిబాబా చరిత్ర. (బుర్రకథ)

పుండరీకుని చరిత్రము. (పండరి స్థలమాహాత్మ్యము)

ఆపదుద్ధారక శతకము.

ఏమిరా, నిన్ను పేక్షింతునా ? (బాబాభక్తుల అనుభవములు)

(వచనకావ్యము)